# ఎ. రాస్కిన్

# నాన్నారి చిన్నతనం









"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్



# విషయసూచిక

# చెప్పదలచుకున్న ముక్కలు

బుజ్జి పిల్లలూ!

అసలు నేను యీ పుస్తకం యెందుకు రాయాల్సి వచ్చిందో చెప్తాను. మాకు వో అమ్మాయి వుంది. ఆమె పేరు సాష. యిప్పుడా అమ్మాయి చిన్న పిల్ల కాదులెండి. యెప్పుడు తన గురించి యిప్పుడు చెప్పినా "నా చిన్నతనంలో..." అంటూ వుంటుంది. అవును మరి, సాష బుజ్జి పిల్లగా వున్నప్పుడు ఆమెకి యెప్పుడూ యేదో నలతగానే వుండేది. ఇన్‌ఫ్లూయెంజా జ్వరం వచ్చింది. గొంతు వాపు వచ్చింది. చెవి పోటు వచ్చేది. మీకెప్పుడేనా చెవి పోటు వస్తే తెలుస్తుంది యెంత బాధగా వుండేదీనీ. మీకెప్పుడూ చెవి పోటు రాలేదూ, నేను చెప్పినా తెలీదు యెంత బాధగా వుండేదీనీ!

ఓ సారి సాషకి చెవి పోటు యెంతలా వొచ్చిందనుకున్నారు? వో పగలూ రాత్రీ యేకథారగా యేడ్చింది, కంటికి కునుకు వస్తే వొట్టు. నాకు యెంత బాధ కలిగిందంటే నాకు యేడుపు వొచ్చినంత పనైంది. అప్పుడు నవ్వు తెప్పించే కథలు చదివి వినిపించేను, చెప్పేను. నేను చిన్న పిల్లాడిగా వున్నప్పుడు బంతిని కారుకింద యెలా విసిరానో చెప్పేను. సాషకి ఆ కథ బాగా నచ్చింది. తన నాన్న కూడా వొకప్పుడు చిన్న పిల్లాడిగా వున్నాడనీ, అప్పుడు కొంటె పనులు చేసేవాడనీ, చివాట్లు దెబ్బలు తినేవాడనీ తెలిసి ఆశ్చర్యపోయింది. ఆమె ఆ కథ మర్చిపోలేదు. యెప్పుడు చెవి పోటు వచ్చినా "నాన్నా, నాన్నా! చెవి పోటుగా వుంది, నువ్వు చిన్న పిల్లాడిగా వున్నప్పుడు యేం జరిగిందో చెప్పు" అనేది. అలా అడిగిన ప్రతి సారీ నేను యేదో కథ చెప్పేవాణ్ణి. అవన్నీ యీ పుస్తకంలోకి యెక్కాయి.

నా చిన్నతనంలో జరిగిన తమాషాలన్నీ గుర్తు చేసుకునేవాణ్ణి, యేమంటే వొంట్లో బాగాలేని చిన్న పిల్లని నవ్వించాలని నాకు వుండేది. అదీ గాకుండా, దురాశగా, బడాయికోరుగా వుండకూడదనీ, గొప్పలు పోకూడదనీ ఆమె అర్థం చేసుకోవాలని నాకు వుండేది. అంత మాత్రం చేత నేనెప్పుడూ అలా వున్నానని కాదు. అలాంటి తమాషా సన్నివేశాల్ని గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించేవాణ్ణి. ఒకో అప్పుడు నాకు చెప్పడానికి యేదీ తట్టకపోతే నాకు తెలిసిన యితర నాన్నల కథలు చెపుతూ వుండేవాణ్ణి. యింతా చేసి ప్రతి నాన్నా వొకప్పుడు చిన్న పిల్లాడే కదా. అంచేత వీటిల్లో వొక్క కథ కూడా కల్పితం కాదు. యివన్నీ చిన్న పిల్లల అనుభవాలే.

యిప్పుడు సాష చిన్న పిల్లా కాదు, ఆమెకి నలతలూ చెయ్యేలేదు. తనంతట తనే పెద్ద పెద్ద పుస్తకాలు చదివేస్తోంది.

కాని వో నాన్న చిన్న పిల్లాడిగా వున్నప్పుడు అతనికేం జరిగిందో తెలుసుకోవాలని యితర పిల్లలకి వుంటుంది కదా!

యిదీ నేను చెప్పదలచుకున్నది. కాని ఆగండి! యింకా వుంది. యీ పుస్తకం యింతటితో అవలా. మిగిలిన దాన్ని మీలో ప్రతి వొక్కరూ మీకుగా తెలుసుకుంటారు. యేమంటే తన చిన్నప్పుడు యెలా వున్నదీ మీ నాన్నే మీకు చెప్పగలడు. అలాగే మీ అమ్మలూనూ! మరి వాళ్ల కథలు వినాలని నాకు వుంటుంది.

మీకు శుభం కలగాలి అని కోరుతూ

మీ మిత్రుడు

ఎ. రాస్కిన్

# నాన్న బంతిని కారు కిందకి విసరడం



నాన్న బుజ్జి పిల్లాడిగా వున్నప్పుడు పావ్లొవొ పొసాద్ అనే చిన్న బస్తీలో వుండేవాడు. అప్పుడు నాన్నకి ఆయన అమ్మా, నాన్నా చక్కటి పెద్ద బంతిని కొనిపెట్టేరు. అది అచ్చం సూర్య బింబంలాగా వుండేది. అబ్బే, యింకా బాగా వుండేది. దానికేసి వొరగా చూడక్కర్లేదు. తిన్నగా చూడచ్చు. సూర్యుడి కంటే నాలుగింతలు అందంగా వుండేది. యేమంటే దానికి నాలుగు వేరు వేరు రంగులు వుండేవి. సూర్యుడికి వున్నది వొక్క రంగే. అదీ యేమిటైంది చెప్పనూలేం. నాన్న

బంతి వో పక్కన కెంపు రంగులో వుండేది. యింకో పక్క జేగురు రంగులో వుండేది. పైన ఆకాశంలా నీలంగా వుండేది. కింద పచ్చగడ్డిలాగా ఆకుపచ్చగా వుండేది. పావ్లొవొ పొసాద్‌లో యెవళ్ళూ అంతకు ముందు అలాంటి బంతిని చూసి యెరగరు. దాన్ని మాస్కోలో కొన్నారు. మాస్కోలో కూడా అలాంటి బంతులు యెక్కువ వున్నాయని అనుకోను. యిన్ని మాటలెందుకు? పెద్దవాళ్ళు కూడా యీ బంతిని చూడ్డానికి వచ్చేవాళ్ళు మరి!

"యెంత బాగుందీ బంతి!" అని అన్నవాళ్ళే అందరూ.

నిజం కూడా అంతే. నాన్నకి ఆ బంతంటే గొప్పగా వుండేది. ఆయన యెంత నీలుగుతూ నడిచేవాడంటే ఆ తీరు చూస్తే తనే ఆ బంతిని కనిపెట్టి ఆ నాలుగు రంగులూ వేశాడేమోనని మీకు అనిపిస్తుంది! నాన్న అందమైన ఆ బంతితో ఆడుకోవడానికి వెళ్ళినప్పుడు నాలుగు వేపుల నుంచీ పిల్లలు పరిగెత్తుకుంటూ వచ్చేవారు.

"అబ్బ, యెంత బాగుందీ బంతి! మమ్మల్నీ ఆడనియ్యి" అనేవాళ్ళు.

కాని నాన్న బంతిని గట్టిగా పట్టేసుకునేవాడు.

"వుహుఁ, వీల్లేదు. యిది నా బంతి! యెవళ్ళకీ యిలాంటి బంతి లేదు. దీన్ని మాస్కోలో కొన్నారు! పొండి! నా బంతిని ముట్టుకోవద్దు" అనేవాడు నాన్న.

"నువ్వు ఆశపోతువి, ఆశపోతువి" అని పిల్లలు అనేవాళ్ళు.

కాని వాళ్ళు యేమన్నా నాన్న పట్టించుకునేవాడు కాదు. తన బంతితో వాళ్ళనెవళ్ళనీ ఆడుకోనిచ్చేవాడు కాదు. తనొక్కడే దాంతో ఆడుకునేవాడు. కాని మీరొక్కళ్ళే ఆడుకొంటే సరదా యేం వుంటుంది? అందుకని ఆశగా వుండే చిన్న నాన్న పిల్లల దగ్గర ఆడుకునేవాడు. వాళ్ళు ఉడుక్కునేటట్టు చెయ్యాలని ఆయన కోరిక.

"వాడు ఆశపోతు! మనం వాడితో ఆడద్దు" అని ఆ పిల్లలు అనేవాళ్ళు.

రెండు రోజులు వరుసగా వాళ్ళు ఆయనతో ఆడలేదు. మూడో రోజున వాళ్ళన్నారు:

"నీ బంతి ఫరవా లేదు. పెద్దది, రంగులు బాగా వున్నాయి. కాని యే కారు కిందేనా పడే శావో ఠాప్‌మని పేలిపోతుంది, బంతులన్నిటి లాగానే. అంచేత నీలగాల్సిన పని లేదురా అబ్బాయ్."

"నా బంతి చచ్చినా పేలదు" అని నాన్న గొప్పగా అన్నాడు. నాన్న అప్పటికి యెంత విర్రవీగి పోయేడంటే తనే ఆ నాలుగు రంగులూ వేశాడా అని యెవళ్ళకేనా అనిపిస్తుంది.

"పేలుతుంది" అని వాళ్ళు ఉడికించేరు.

"వుహుఁ, పేలదు."

"ఒరేయ్! అదుగో కారొకటి వస్తోంది. వూఁ, పద, కిందకి విసురు. యేం భయమా?" అన్నారు వాళ్ళు.

చిన్న నాన్న బంతిని కారు కిందకి విసిరేడు. వో క్షణం సేపు అందరూ ఆత్రుతగా చూస్తూ నుంచున్నారు. బంతి ముందు చక్రాల మధ్య దొర్లుకుంటూ పోయి వెనక్కాల కుడి చక్రం కింద ఆగింది. కారు తటపటాయించి బంతిమీదనుంచి పోయింది. బంతి అలానే వుంది.

"పేలలేదు! పేలలేదు!" అని నాన్న దాన్ని తెచ్చుకోడానికి పరిగెడుతూ అరిచేడు. కాని సరిగ్గా అంతలోనే వచ్చింది చప్పుడు — ధన్! యెవళ్లేనా తుపాకీ గుండు పేల్చారేమో అన్నట్టు. ఆ చప్పుడు వచ్చింది బంతినుంచి. యింతా చేసి అది పేలి చక్కాపోయింది. బంతి యెక్కడున్నదీ చూడ్డానికి నాన్న వెళ్లే వేళకి ఆయనకి కనిపించిందంతా దుమ్ము కొట్టుకుపోయిన రబ్బరు పీలిక. అందమూ గిందమూ యేమీ మిగల్లేదు. నాన్న యేడుపు లంకించుకున్నాడు. యింటికి పరిగెత్తి వెళ్లిపోయేడు. పిల్లలంతా వొకటే నవ్వు.

"పేలిపోయింది! పేలిపోయింది! తగిన శాస్తి జరిగింది! ఆశ గొడ్డూ!" అని వాళ్ళు అరిచేరు.

నాన్న యింటికి వెళ్లి తనే బంతిని కారు కింద పడేశానని చెప్పినప్పుడు చిన్న నాన్న అమ్మ, అంటే మా మామ్మ, నాన్నని రెండు చరుపులు చరిచింది. ఆ సాయంత్రం తాత యింటికి వచ్చేక చిన్న నాన్నకి యింకో రెండు చరుపులు పడ్డాయి.

"నిన్ను కొట్టడం బంతి పోయినందుకు కాదు నీ బడుద్దాయి తనానికి" అని తాత నాన్నని చరుస్తూ అన్నాడు.

అంత మంచి బంతిని యెవళ్లేనా కారు కింద యెందుకు పడేస్తారా అనేది యెవళ్లకీ తెలియలేదు.

"చవట పిల్లాడే అలా చేస్తాడు" అన్నారు.

తర్వాత చాలా కాలం పిల్లలు నాన్నని యేడిపించేరు.

"హేయ్, యేదిరా నీ కొత్త బంతి?"

కాని పొరుగింట్లో వున్నాయన నవ్వలేదు. అసలు కథంతా యేమిటో ఓం ప్రథమంనుంచీ చెప్పమని ఆయన నాన్నని అడిగేడు.

"వుహూఁ, కాదు, నువ్వు తెలివితక్కువ కుర్రాడివి కాదు" అన్నాడు.

నాన్నకి చాలా సంతోషం కలిగింది.

"కాని నీకు ఆశ యెక్కువ, గొప్పలు చెప్పుకోవడం యిష్టం" అని పొరుగాయన చెప్పేడు.

"అది చాలా చెడ్డది. తనంతటతనే వొక్కడూ బంతితో ఆడుకుందా మనుకునేవాళ్ళ యెప్పుడూ నష్టపోతారు. యీ విషయం పెద్ద వాళ్ళకీ పిల్లలకీ కూడా వర్తిస్తుంది. యిప్పుడు మారకపోతే యెప్పటికీ విచారించాల్సి వస్తుంది" అన్నాడు.

అప్పుడు నాన్న బెదిరిపోయి యేడుపు లంకించుకున్నాడు. ఆశగా వుండవనీ, గొప్పలు పోవనీ వెక్కివెక్కి యేడ్చాడు. యెంత గట్టిగా యేడ్చాడంటే, యెంత సేపు యేడ్చాడంటే పొరుగాయన నాన్నని నమ్మి కొత్త బంతి కొనిపెట్టేడు. యీ బంతి ముందటి బంతి అంత అందంగా లేదు గాని వీధిలో వున్న పిల్లలందరూ దానితో ఆడుకున్నారు. అందరికీ సరదాగా వుంద నిపించింది, యెవళ్ళూ నాన్నని ఆశపోతు అనలేదు.

# నాన్న కుక్కని మచ్చిక చెయ్యడం



నాన్న చిన్న పిల్లాడిగా వున్నప్పుడు ఆయన్ని సర్కస్‌కి తీసుకువెళ్లారు. చాలా సరదాగా వున్న సర్కస్. అందర్లోకీ నాన్నకి "లయన్ టేమర్" (సింహాల్ని ఆడించేవాడు) యెక్కువ నచ్చేడు. అతను బట్టలు బాగా వేసుకోవడం వొక కారణం. "లయన్ టేమర్" అనే మాటలు చాలా ఘనంగా ధ్వనించడం మరో కారణం. అతనంటే సింహాలూ, పెద్ద పులులూ భయపడడం యింకో కారణం. అతని చేతుల్లో వో కొరడా వుండేది, పిస్టల్స్ వుండేవి. సరే, వాటిని వాడే అవసరం పడేది కాదనుకోండి.

"జంతువులు నా కళ్ళు చూసి బెదురుతాయి" అని అతను సర్కస్ రింగ్‌లోనుంచి చాటే వాడు. "నా కళ్లే నా గొప్ప ఆయుధాలు. యే అడివి జంతువూ మనిషి కళ్లల్లోకి చూడలేదు" అనేవాడు.

నిజం కూడా అంతే. అతను సింహంకేసి చూడగానే అది పీఠం యెక్కేది. పీఠంమీదకి గెంతేది. చచ్చిపోయినట్టుగా కూడా నటించేది. యిదంతా చెయ్యడం యెందుకంటే మనిషి చూపు తట్టుకోలేకపోబట్టే.

బాకాలు మోగుతాయి, ప్రతివాళ్లూ చప్పట్లు కొడతారు, లయన్ టేమర్‌కేసి చూస్తారు. అతను చేతిని ఛాతీమీద పెట్టుకుని వొంగి నమస్కారం పెడతాడు. అన్ని వేపులకీ తిరుగుతూ వంగుతాడు. యెంత భేషుగ్గా వుంటుంది. తను కూడా లయన్ టేమర్ అవాలని చిన్న నాన్న తీర్మానం చేసేసుకున్నాడు. మరీ అడివి జంతువు గాకుండా వున్న దాన్ని మచ్చిక చెయ్యాలని ఆయన అనుకున్నాడు. నాన్న కూడా చిన్నాయనే కదా మరి. కొత్తగా నేర్చుకునే వాళ్లకి సింహాలూ, పెద్ద పులులూ లాంటి పెద్ద పెద్ద జంతువులు కాదు అని ఆయనకి తెలుసు. కుక్కతో మొదలుపెడితే బాగుంటుంది. అది కూడా మరీ పెద్ద కుక్క కాకూడదు. పెద్ద కుక్క కూడా చిన్న సింహంలాగానే వుంటుంది కదా మరి. అంచేత తనకి కావాల్సింది వో మాదిరి కుక్క.

ఆయనకి కావాల్సింది కొన్ని రోజుల్లోనే దొరికింది.

పావ్లొవా పాసాద్‌లో వో చిన్న పార్కు వుంది. యిప్పుడక్కడ పెద్ద పార్కు వుంది లెండి. అయినా యిదంతా యేనాటి మాటో లెండి. మామ్మ చిన్న నాన్నని ఆ పార్కుకి తీసుకు వెడుతూ వుండేది. ఓ రోజున మామ్మ చదువుకుంటూ బల్లమీద కూర్చుంది. నాన్న ఆడుకుంటున్నాడు. దగ్గర్లోనే వొకావిడ తెల్ల కుక్కతో కూర్చుంది. ఆవిడ కూడా చదువుకుంటూనే వుంది. కుక్క చిన్నది. దాని కళ్లు పెద్దవి, నల్లగా వున్నాయి. అది నాన్నకేసి నల్లని పెద్ద కళ్లతో చూసింది. "నన్ను యెవళ్లేనా మచ్చిక చెయ్యాలని నాకు యెంత యిదిగానో వుంది. బాబూ! నన్ను మచ్చిక చెయ్యవూ! మనిషి కళ్లని నేను తట్టుకోలేకుండా వున్నాను" అంటున్నట్టుగా వుంది దాని చూపు.

చిన్న నాన్న చిన్న కుక్కని మచ్చిక చేద్దామని వెళ్లాడు. మామ్మ పుస్తకం చదువుకుంటూనే వుంది, ఆ కుక్క యజమానురాలూ చదువుకుంటూనే వుంది. దాంతో వాళ్లు చూళ్లేదు పక్కనే యేం జరుగుతూ వున్నదీనీ. కుక్క బల్ల కింద పడుకుంది. నల్లని పెద్ద కళ్లతో నాన్నకేసి చూస్తూనే

వుంది వింతగా. నాన్న దానికేసి మెల్లిగా నడిచి వెళ్లాడు. "హోయ్! నా చూపుని యిది తట్టుకోగల దనుకుంటాను. అసలు సింహంతో మొదలుపెట్టి వుండాల్సింది. మచ్చిక కావడం విషయంలో యిది బుద్ధి మార్చుకుందనుకుంటాను" అనుకున్నాడు నాన్న.

ఆ వేళ చాలా వేడిగా వుంది. నాన్న నిక్కరు తొడుక్కుని చెప్పులు వేసుకుని వున్నాడు. నాన్న కుక్క దగ్గరికి, యింకా దగ్గరికి వెడుతున్నాడు. కాని అది మాత్రం అలానే కదలకుండా పడు కుంది. నాన్న బాగా దగ్గరికి వెళ్లగానే అది ఠకామని యెగిరి గెంతి ఆయన పొట్టమీద కరిచింది. యింక చూడండి బాబూ గోలగోల అయిపోయింది! నాన్న అమ్మో అంటూ అరిచి గీపెట్టాడు. మామ్మా అలానే అరిచి గీపెట్టింది. కుక్క యజమానురాలూ అరిచి గీపెట్టింది. కుక్క గట్టిగా భౌభౌ అని అరిచింది. చిన్న నాన్న అమ్మో అని వొకటే అరుపు!

"అమ్మోయ్! కుక్క కరిచింది!"

మామ్మ గీపెట్టింది:

"బాబోయ్! అది వీణ్ణి కరిచింది!"

కుక్క యజమానురాలు అరిచింది:

"వాడు కుక్కని ఉడికించేడు! మా కుక్క యింతవరకూ యెవర్నీ కరవలేదు మరి."

యిక కుక్క యేమని అరిచి గీపెట్టిందో మీరు వూహించుకోవాలంతే!

అన్ని వేపులనుంచీ జనం వచ్చి పోగయేరు. అందరూ అరుస్తూనే వున్నారు:

"దారుణం!"

పార్కు కాపలావాడు వచ్చి అడిగేడు:

"బాబూ! నువ్వు కుక్కని ఉడికించేవా?"

"వుహుఁ! నేను దాన్ని మచ్చిక చేస్తున్నాను" అని నాన్న చెప్పేడు.

అందరూ నవ్వేరు.

"యెలా మచ్చిక చేస్తున్నావ్?"

"నేను దాని దగ్గరికి వెడుతున్నాను. యిప్పుడు తెలిసింది నాకు, దీనికి మనిషి చూపు సరి పడదు, తట్టుకోలేదు" అని నాన్న చెప్పేడు.

అందరూ మళ్లీ ఫక్కున నవ్వేరు.

"చూశారా? కుర్రాడిదే తప్పు" అంది కుక్క యజమానురాలు. "కుక్కని మచ్చిక చెయ్య మని యెవళ్లూ యీ కుర్రాణ్ణి అడగలేదు. మరి మీరు" అంటూ ఆమె మామ్మకేసి తిరిగి

''మీకు జరిమానా వెయ్యాలి కుర్రాణ్ణి సరిగా చూసుకోనందుకు'' అంది.

మామ్మ నోరు వెళ్లబెట్టింది. ఆమెకి యెంతో ఆశ్చర్యం అయిపోయి నోట మాట రాలేదు. పార్కు కాపలావాడు అన్నాడు:

''ఆ నోటీసు చూశారమ్మా? 'కుక్కల్ని తీసుకురాకూడదు' అని వుంది. 'పిల్లల్ని తీసుకు రాకూడదు' అని వుంటే యీవిడకి జరిమానా వేసి వుండేవాణ్ణి. కాని యిప్పుడు మీకు జరిమానా వేస్తాం. తమరు యిక్కడినుంచి వెళ్లిపోవాలి. యీ కుర్రాడు ఆడుకుంటూ వున్నాడు, మీ కుక్క కరిచింది. యిక్కడ ఆడుకోవచ్చు, కాని కరవకూడదు. అయినా బాబూ! ఆడుకునేటప్పుడు బుర్ర ఉపయోగించాలి. కుక్కకి తెలీదు కదా నువ్వెందుకు దాని దగ్గరికి వెడుతూ వున్నావో. నువ్వు దాన్ని కరవడానికి వెడుతున్నావని అది అనుకొంది. యేం, తెలిసిందా?''

''ఆఁ'' అన్నాడు నాన్న. లయన్ టేమర్ కావాలన్న కోరిక పోయింది ఆయనకి. ఆ తీసుకోవాల్సిన ఇంజక్షన్లు తీసుకున్నాక — వొక వేళ యే ప్రమాదమన్నా ముంచుకు వస్తుందేమోనని ముందు జాగ్రత్తగా — లయన్ టేమింగ్ తనకి నప్పే వృత్తి కాదని ఆయనకి అనిపించింది.

జంతువులు తట్టుకోలేవు అని భావించుకునే మానవ దృక్కు పట్ల యిప్పుడు ఆయనకి సొంత అభిప్రాయం యేర్పడింది. తర్వాత నాన్న వో కుర్రాణ్ణి చూశేడు, ఆ కుర్రాడు వో పెద్ద కుక్క కంటి రెప్పలు పట్టుకు లాగబోయేడు. నాన్నా, ఆ కుర్రాడూ ఠకామని వొకళ్లనొకళ్లు అర్థం చేసుకున్నారు.

కాని కుక్క ఆ కుర్రాణ్ణి రెండు చెక్కిళ్లమీదా కరిచింది, పొట్టమీద కాకుండా. అయినా అతనూ పొట్టమీదే ఇంజక్షన్లు చేయించుకోవాల్సి వచ్చింది.

# నాన్న కవిత్వం రాయడం



చిన్నప్పుడు పుస్తకాలు చదవడం నాన్నకి యిష్టంగా వుండేది. నాలుగో యేటే ఆయన చదవడం నేర్చుకున్నాడు. రోజంతా చదువుకుంటూ గడపగలిగేవాడు. మిగతా పిల్లలూ కేరింతాలు కొడుతూ పరుగున పోయి ఆటలు ఆడుకుంటూ వుంటే చిన్న నాన్న చదువుకుంటూ, చదువుకుంటూ గడిపేవాడు. మామ్మకీ, తాతకీ దిగులు పట్టుకుంది. అంతలా చదవడం మంచిది కాదని వాళ్లకి అనిపించింది. నాన్నకి పుస్తకాలు యిచ్చేవాళ్లు కాదు. రోజుకి మూడు గంటలకంటే యెక్కువ సేపు చదవనిచ్చేవాళ్లు కాదు. కాని దానివల్ల లాభం లేకపోయింది. చిన్న

నాన్న పొద్దుట్నుంచి సాయంత్రం దాకా చదువుతూనే వుండేవాడు. ఆ మూడు గంటల చదువూ నలుగురి ముందూ సాగించేవాడు. తర్వాత మాయమైపోయేవాడు. మంచం కింద దూరి అక్కడ చదువుకునేవాడు. మిద్దెమీద దాంకుని అక్కడ చదువుకునేవాడు. గడ్డి వాము దగ్గరికి పోయి అక్కడ చదువుకునేవాడు. గడ్డి వాము దగ్గర చదువుకోవడం చాలా భేషుగ్గా వుండేది. కొత్త గడ్డి కమ్మని తావు లీనేది. తనెక్కడున్నాడో మంచాలూ, కుంచాలూ వెతికేస్తూ అందరూ అరుస్తూ వుండడం యింట్లోనుంచి నాన్నకి వినిపించేది. చిన్న నాన్న సాయంత్రం భోజనాల వేళకి తిరిగి వచ్చేవాడు. వెంటనే ఆయన్ని తిట్టేవారు, కొట్టేవారు. నాన్న గబగబ భోజనం చేసేసి మంచం యెక్కేసేవాడు. అర్ధరాత్రి వేళ లేచేవాడు, దీపం వేసుకుని చదువుకునేవాడు. ఆయన చుకోవ్‌స్కీ 'మొసలి కాజేసిన సూర్యుడు' చదివేవాడు. పూష్కిన్ అద్భుత కథలు, 'అరేబియన్ నైట్స్ కథలు', 'గలివర్ యాత్రలు', 'రాబిన్‌సన్ క్రూసో' చదివేవాడు. ప్రపంచంలో యెన్ని అద్భుతమైన పుస్త కాలున్నాయి! నాన్న ప్రతి పుస్తకాన్నీ చదవాలనుకున్నాడు. గంటలు తెలియకుండానే గడిచిపోయేవి. మామ్మ వచ్చి పుస్తకం లాగేసుకుని దీపం ఆర్పేసేది. మళ్లీ కొంచెం సేపయాక నాన్న దీపం వేసుకుని యిందాకటి పుస్తకం అంత సరదాగానూ వుండే మరో పుస్తకం తీసుకుని చదువు మొదలుపెట్టేవాడు. అప్పుడు తాతయ్య వచ్చి పుస్తకం లాగేసుకుని దీపం ఆర్పేసి నాన్నని చీకట్లో వో చరుపు చరిచేవాడు.

నాన్న మనసు గాయపడినంతగా యీ చరుపు ఆయన్ని గాయపరిచేది కాదు.

మొత్తంమీద అంతా విషాదాంతంగా ముగిసింది. చిన్న నాన్నకి చూపు పాడైపోయింది. మంచంకింద, మిద్దెమీద, గడ్డి వాము దగ్గర వెలుతురు బాగా వుండదు కదా యింతా చేసి! అదీ గాకుండా దుప్పటీ ముసుగేసుకుని చదవడం ఆయనకి అలవాటయింది. వెలుతురు రావడానికి చిన్న కంత మాత్రం వుంచి మిగతా అంతా ముసుగు పెట్టేసుకునేవాడు. మసక వెలుతుర్లో పడుకుని చదవడం మంచిది కాదు. దాంతో చిన్న నాన్న కళ్లద్దాలు పెట్టుకోవాల్సి వచ్చింది.

అదుగో అప్పుడే నాన్న లల్లాయి ఉల్లాయి పదాలు అల్లడం మొదలెట్టేడు.

ఆయన వో ఆవుని చూసి
ఆవూ!
యిటు రావూ! అన్నాడు.

ఓ కుక్కని చూసి

కుక్కా

ఫో, యెం చక్కా! అన్నాడు.

కోడిని చూసి

కొక్కొరో కోడీ

కుదురు నీకు జోడీ! అన్నాడు.

తర్వాత వో రోజున వాళ్ల నాన్నని చూసి

మా మంచి నాన్నా,

చెప్పం డేమన్నా! అన్నాడు.

మామ్మకీ, తాతకీ నాన్న పదాలు యెంతో బాగా నచ్చేయి. వాళ్లు వాటిని రాసి యెవళ్లేనా వచ్చినప్పుడు చదివి వినిపించేవాళ్లు. ఆ వచ్చిన వాళ్లు కూడా వాటిని యెత్తి రాసుకునేవారు. యిక అప్పట్నుంచి యెవళ్లు యెప్పుడు వచ్చినా

"యేదీ, నీ కవిత్వం పాదాలు చదివి వినిపించవూ?" అని అడిగేవాళ్లు.

చిన్న నాన్న తను కొత్తగా రాసినవి చదివి వినిపించేవాడు.

ఒంటరి పిల్లి

తివదింక ఉల్లి!

ఆ వచ్చిన పెద్ద వాళ్లు ఫక్కున నవ్వేవాళ్లు. యీ పదాలు యేం బాగా లేవనీ, యిలాంటి వాటిని యెవడన్నా కూర్చగలడనీ వాళ్లకి తెలుసు. కాని చిన్న నాన్నకి అవి అద్భుతంగా కనిపించేవి. పెద్ద వాళ్లు సంతోషంగా నవ్వుతున్నారని అనుకునేవాడు. తను అచ్చం కవిని అనే ఆయన భావన. ప్రతి పుట్టిన రోజు పండగ నాడూ కేక్ కోసే ముందూ, కోశాకా కూడా ఆయన వాటిని చదివేవాడు. లీజా అత్త పెళ్లికి కూడా ఆయన సొంత కవిత్వం చదివేడు. అప్పుడది అంత సరసంగా లేకపోయింది. యేమంటే

పెళ్లవుతుందని లీజా క్కూడా

అనుకున్నామా కల్లో కూడా

అనే ప్రాస విని వచ్చిన వాళ్లు భలేగా నవ్వుకున్నారు కాని లీజా అత్తకి గిరుక్కున కళ్లల్లో నీళ్ల

తిరిగేయి. ఆవిడ వొక్క ఉదుటన్న తన గదిలోకి పారిపోయింది. పెళ్లి కొడుక్కి కళ్లల్లో నీళ్లు తిరగలేదు కాని అతను నవ్వలేదు.

నాన్నని తిట్టలేదు, కొట్టలేదు. లీజా అత్తని కష్టపెట్టడం ఆయన ఉద్దేశం కాదు కదా. కాని తన పదాలు చూసి కొంతమంది పెద్ద వాళ్లు అంతకు ముందులాగా సంతోష పడడం లేదని నాన్న అర్థం చేసుకున్నాడు. అప్పుడు వొకాయన మరొకాయనతో మాట్లాడుతూ వుండడం ఆయన విన్నాడు.

''యీ 'వుండర్‌కిండ్' యిక ఉల్లాయి పదాలు చదవకుండా వుంటే బాగుండును'' అన్నాడాయన.

నాన్న మామ్మ దగ్గరికి వెళ్లి ''వుండర్‌కిండ్ అంటే యేమిటమ్మా?'' అని అడిగేడు.

''అద్భుతమైన పిల్లాడు అని అర్థం'' అని మామ్మ చెప్పింది.

''అంటే వాడేం చేస్తాడు?''

''వయొలిన్ వాయిస్తాడు, లెక్కలు బాగా చేస్తాడు. లేకపోతే తల్లిని అవి యివీ అడిగి విసిగించడు.''

''మరి పెద్దయాక అలాంటి వాళ్లు యేమవుతారు?''

''మామూలు సాదా మనుషులు అవుతారు.''

''అలాగా! అర్థమైందిలే'' అని నాన్న అన్నాడు.

మళ్లీ పుట్టిన రోజు పండగ నాడు తన పదాలు చదవలేదు. తల నొప్పిగా వుందని తప్పించుకున్నాడు. ఆ తర్వాత చాలా కాలం కవిత్వం రాయలేదు. యిప్పుడు కూడా యెవళ్లన్నా పుట్టిన రోజు పండగ నాడు పదాలు చదవమంటే ఆయనకి తల నొప్పి వచ్చేస్తుంది.

# నాన్న ప్రొఫెసరుగార్ని కరవడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి యెప్పుడూ జలుబు చేస్తూ వుండేది. తుమ్ముతూ దగ్గుతూ వుండేవాడు. ఒకోసారి ఆయన గొంతుక రాసుకుపోయేది. ఒకోసారి చెవి నొప్పి వచ్చేది. ఓ సారి ఆయన్ని మా తాతా మామ్మా డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్లేరు. "చెవి, ముక్కు, గొంతు చికిత్సా నిపుణులు" అన్న బోర్డు ఆ డాక్టరు యింటి ముందు వుంది.

"యిది యీాయన పేరా?" అని నాన్న అడిగేడు.

"కాదు, ఆయన వాటికి చికిత్స చేస్తారు. కొంచెం మాట్లాడకుండా వూరుకో."

డాక్టరుగారు నాన్న చెవి పరీక్షించేరు. నాన్న ముక్కు, గొంతుక పరిక్షించేరు. పరీక్షలయేక నాన్నకి ఆపరేషన్ చెయ్యాలని డాక్టరుగారు అన్నారు. అందుకని నాన్నని మాస్కోకి తీసుకు వెళ్లేరు. నాన్నకి అడెనాయిడ్స్ ఆపరేషన్ చెయ్యాలి.

నాన్నని పరీక్షించిన ఆయన చాలా పెద్ద డాక్టరు ప్రొఫెసరు. చాలా పెద్ద వాడు, కటువుగా వుండేవాడు. ఆయన తల అంతా పండిపోయింది.

"నోరు తెరు!" అన్నారాయన.

నాన్న నోరు తెరిచాక ఆ పెద్ద మనిషి కనీసం "మంచిది" అని కూడా అనలేదు. నోట్లో వేలు పెట్టి కెలకడం మొదలుపెట్టేడు. నాన్నకి చాలా నొప్పి పెట్టేస్తోంది, బాధగా వుంది. "అద్గదీ, యిదుగో యిక్కడున్నాయి!" అంటూ ప్రొఫెసరుగారు యింకా గట్టిగా నొక్కేరు. వెంటనే ప్రొఫెసరు అమ్మ బాబోయ్ అని అరుస్తూ చేతిని నాన్న నోట్లోంచి లాగేసుకున్నారు. ఆయన బొటన వేలునుంచి రక్తం కారుతోంది, అందరూ చూశేరు. ప్రొఫెసరుగారి గదిలో సద్ద ణిగి పోయింది.

"అయొడిన్" అని ఆయన అరిచేరు.

అయొడిన్ ఆయనకి అందించేరు. కొంచెం వేలికి రాసుకున్నారు.

"బేండేజ్" అని అరిచేరు.

ఆయనకి బేండేజ్ యిచ్చేరు. ఆయన రెండో చేత్తో బేండేజీని బొటన వేలుకి కట్టుకున్నారు.

అప్పుడు ప్రొఫెసరుగారు లోగొంతుకలో మాట్లాడేరు.

"నలభై యేళ్లుగా ప్రాక్టీసు చేస్తున్నా, యిదే మొదటి సారి నా వేలు కొరకడం. మీరు వేరే డాక్టరుని చూసుకోండి ఆపరేషన్‌కి. నే వెళ్లిపోతున్నా. మీకూ, మీ ఆపరేషన్‌కీ వో దణ్ణం" అన్నారు.

తర్వాత ఆయన చేతులు సబ్బుతో కడుక్కుని వెళ్లిపోయేడు. అప్పుడు తాతకి మా చెడ్డ కోపం వచ్చేసింది.

"యీ డాక్టరుగారికి చూపిద్దామనే నిన్ను మాస్కో తీసుకువచ్చేం. నీకు బాగు చెయ్యాలని ఆయన అనుకున్నాడు. తీరా చూస్తే యేం చేశావ్ నువ్వు? చూడు. దంత వైద్యుడి గది యీ పక్కనే వుంది. అక్కడ డాక్టర్లని కరిచే పిల్లల పళ్లు పీకేస్తారు. అక్కడికి వెడదామా? ఆపరే షన్ అయేక ఐస్ క్రీమ్ పెట్టిస్తానన్నానుగా మరి!" అన్నాడాయన.

ఐస్ క్రీమ్ మాట చెవిని బడగానే నాన్న ఆలోచనలో పడ్డాడు, యేమంటే ఆయన్ని యెప్పుడూ ఐస్ క్రీమ్ తిననిచ్చేవారు కాదు. ఐస్ క్రీమ్ తింటే ఆయన చెవి, ముక్కు, గొంతు యింకా నొప్పి పెడతాయని మామ్మకీ, తాతకీ భయంగా వుండేది. కాని నాన్నకి ఐస్ క్రీమ్ అంటే యిష్టం. అలాంటి ఆపరేషన్ అయేక పిల్లలకి ఐస్ క్రీమ్ పెడతారనీ, దానివల్ల రక్తం కారకుండా వుంటుం దనీ అనేవాళ్లు. ఆ రోజుల్లో అలా పెట్టేవాళ్లు. అంచేత ఐస్ క్రీమ్ గురించి ఆలోచించుకుంటూ నాన్న అన్నాడట:

"యిక కొరకను."

అయినా నాన్నకి ఆపరేషన్ చేసిన పడుచు డాక్టరు ఆయన్ని హెచ్చరించేడు,

"గుర్తుంచుకో, జాగ్రత్తుస్మా, కొరకనని అన్నావ్" అని.

"నేను కొరకను" అని నాన్న మళ్లీ అన్నాడు.

నాన్నని వో ప్రత్యేకరకమైన కుర్చీలో కూర్చోబెట్టి ఆయన కాళ్లూ, చేతులూ పట్టుకున్నారు. అలా పట్టుకోవడం ఆయన యెవళ్లనో కరిచిన దానివల్ల కాదు, అది మామూలుగా వుండే పద్ధతి. పిల్లలు డాక్టరుగారి పనికి అడ్డం రాకుండా వుండేందుకు అలా చేస్తారు. నాన్నకి నొప్పిగా వుంది కాని ఆయన అంతసేపూ ఐస్ క్రీమ్ గురించే అనుకుంటూ వున్నాడు.

"బాగుంది! బాగుంది! అయిపోయింది! బాగుంది, నువ్వసలు యేడవనన్నా యేడవలేదు!" అని డాక్టరు అన్నాడు.

నాన్నకి చాలా సంతోషం కలిగింది. అప్పుడు డాక్టరు మళ్లీ అన్నాడు:

"అయ్యో, కొంచెం మిగిలిపోయింది, యింకొక్క క్షణం వోపిక పడతావా?" అని.

"అలాగే" అని నాన్న అన్నాడు. మళ్లీ ఐస్ క్రీమ్ గురించి అనుకోవడం మొదలుపెట్టాడు.

"అద్గదీ! యిప్పుడు నిజంగా పూర్తయింది. నువ్వు మంచి కుర్రాడివి. యిక ఐస్ క్రీమ్ తినచ్చు. యే రకం ఐస్ క్రీమ్ కావాలో చెప్పు" అన్నాడు డాక్టరు.

"వానిల్లా" అని నాన్న దాని పేరు చెపుతూ తాతకేసి చూశేడు. తాతకి నాన్నమీద యింకా కోపం తగ్గలేదు.

"ఐస్ క్రీమ్, గియిస్ క్రీమ్ లేకపోయినా ఫరవా లేదులే, యీ సారి కరవకుండా వుంటావు" అన్నాడాయన.

ఐస్ క్రీమ్ రాదని తేలిపోయాక నాన్నకి భోరుమని యేడుపొచ్చింది. అందరికీ నాన్నని చూసి జాలేసింది. కాని తాతయ్య పట్టువదల్లేదు. అది చాలా అన్యాయమని నాన్నకి అనిపించి, యివాల్టికి

కూడా దాన్ని ఆయన మరిచిపోలేదు. అప్పణ్నుంచి యెంత ఐస్ క్రీమ్ అయినా తిని వుండచ్చుగాక, వానిల్లా, చాకొలెట్, స్ట్రాబెర్రీలాంటి అన్ని రకాలూ తిని వుండచ్చుగాక, ఆపరేషన్ అయేక కొనిపెడతామన్న ఐస్ క్రీమ్‌ని ఆయన మరిచిపోలేదు.

ఆపరేషన్ తర్వాత నాన్నకి అంతకు ముందటిలాగా నలత చేసేది కాదు. తుమ్మడం, దగ్గడం తగ్గేయి, గొంతు నొప్పి తగ్గింది, చెవి నొప్పీ తగ్గింది.

ఆపరేషన్‌వల్ల నాన్నకి చాలా మేలు జరిగింది. తరవాత్తరవాత బాగా వుండడానికి యిప్పుడు తాత్కాలికంగా కొంచెం నొప్పి భరించాల్సి వచ్చినా ఫరవా లేదని ఆయనకి అర్థం అయింది. తరవాత చాలా మంది డాక్టర్లు ఆయన్ని పొడిచినా, గుచ్చినా ఆయన వొక్కాళ్లని కూడా కరవలేదు. యేమంటే వాళ్లు అలా చెయ్యడం తన కోసమే గదా అని ఆయనకి తెలుసు. డాక్టరు దగ్గరికి వెళ్లిన ప్రతి సారీ నాన్న ఐస్ క్రీమ్ కొనుక్కునేవాడు. నాన్నకి అదంటే యిప్పటికీ యిష్టమే.

# తను యేం కావాలనుకున్నాడో నాన్న నిర్ణయించుకోవడం




"నువ్వు పెద్దయాక యేం కావాలనుకుంటున్నావు?" అని నాన్నని చిన్నప్పుడు యెక్కువ అడిగే వారట. నాన్నకైతే జవాబు యెప్పుడూ రెడీగానే వుండేదిట. కాని పట్టు పట్టుకీ కొత్తగా చెప్పేవాడట. మొదట నాన్న నైట్ వాచ్‌మన్ కావాలనుకున్నాట్ట. వూరంతా పడుకుని జోగుతూ వుంటే నైట్ వాచ్‌మన్ మెలుకువగా వుండి కాపలా కాయడం ఆయనకి బాగా వున్నట్టనిపించేది. నైట్ వాచ్‌మన్ కర్రతో నేలమీద తాడిస్తూ గస్తీ తిరుగుతాడు, దొంగలకి భయం కలిగించడానికి, ఆ కర్ర చాలా బాగుంటుందని పించింది. తను గోల

చెయ్యడం సంతోషంగా అనిపించేది ఆయనకి. పెద్దయాక నైట్ వాచ్‌మన్ అవుతాను ఖాయంగా అనుకునేవాడట. కాని ఐస్ క్రీమ్ బండివాడు ఆకుపచ్చ బండి. తోసుకు వచ్చేవాడు యింతలోకీ. యికనేం మరి! తను ఆ బండి తోసుకోవచ్చు, మనను పుట్టినంత ఐస్ క్రీమ్ తినెయ్యొచ్చు! అనిపించేది.

"ఓ ఐస్ క్రీమ్ అమ్మితే నేనో ఐస్ క్రీమ్ తినేస్తాను!" అనుకున్నాడు నాన్న. "చిన్న పిల్లలకి ఐస్ క్రీమ్ వూరికే యిచ్చి తినిపించేస్తాను" అనుకున్నాడు.

నాన్న ఐస్ క్రీమ్ అమ్మేవాడు కావాలను కుంటున్నాడని విని నాన్న అమ్మా, నాన్నా ముక్కు మీద వేళ్లు వేసుకున్నారు. వాళ్లకి అది చిత్రంగా కనిపించింది. కాని అది చాలా నవరస భరితంగా పెద్దవాడవడం అని నాన్నకి అనిపించింది.

అప్పుడు వో రోజున నాన్నకి రైల్వే స్టేషన్లో వో చిత్రమైన మనిషి తగిలేడు. అతను కోచీల తోనూ, ఇంజన్‌లతోనూ ఆడుకుంటున్నాడు. కాని అవి నిజమైన కోచీలు ఇంజన్‌లూనూ. అతను ప్లాట్‌ఫాంమీదనుంచి కిందికి ఉరికి కోచీల కిందకి పాకేవాడు. భలే అద్భుతమైన ఆట అది!

"యెవరతను?" అని నాన్న అడిగేడు.

"షంటర్" అని నాన్నకి చెప్పారు.

అప్పుడు నాన్నకి అర్థం అయింది తను పెద్దయాక యేం అవాల్సిందీసీ. అబ్బ చూడండి! తను రైల్వే కోచీల షంటింగ్ చేస్తాడు. లోకంలో యింతకంటే సరదా అయింది యేం వుంటుంది? యేదీ లేదు. నాన్న షంటర్ అవుదా మనుకుంటున్నాడని విని యెవరో అన్నారట:

"మరి ఐస్ క్రీమ్ మనిషి సంగతో?" అని.

భలే చిక్కొచ్చి పడిందే. నాన్న షంటర్ అయిపోవాలని తీర్మానం చేసుకున్నాడాయిరి. అలా అని మెరిసిపోయే ఆకుపచ్చ ఐస్ క్రీమ్ బండిని వదలనూ లేడు. యేం చెయ్యాలి? ఆఖరికి ఆయనకి యీ చిక్కు విడే మార్గం కనిపించింది.

"నేను షంటర్‌నీ అవుతాను, ఐస్ క్రీమ్ మనిషినీ అవుతాను" అన్నాడు.

ప్రతి వాళ్లకీ ఆశ్చర్యం కలిగింది. కాని చిన్న నాన్న చక్కగా వివరించి చెప్పేడు.

"యిదేమీ కష్టం కానే కాదు. పొద్దుటి పూట ఐస్ క్రీమ్ అమ్ముతాను. కొంచెం సేపు ఐస్ క్రీమ్ అమ్మేక స్టేషన్‌కి వెడతాను. అక్కడ కాసిని కోచీలని షంటింగ్ చేశాక మళ్లీ మరి కొంచెం ఐస్ క్రీమ్ అమ్ముతాను. తర్వాత మళ్లీ స్టేషన్‌కి వెళ్లి మళ్లీ కోచీల్ని షంటింగ్ చేసి తర్వాత మళ్లీ ఐస్ క్రీమ్ అమ్ముతాను. యిదేమీ కష్టం కానే కాదు. యేమంటే నేను బండిని

స్టేషన్ దగ్గర పెట్టుకుంటాను. రైళ్ల కోసం దూరం వెళ్లనవసరం వుండదు.''

అందరూ మళ్లీ నవ్వేరు. అప్పుడు చిన్న నాన్నకి కోపం వచ్చింది.

''నన్ను చూసి నవ్వేరంటే నేను నైట్ వాచ్‌మన్‌ని అవుతాను. ఆఁ! రాత్రిళ్లప్పుడు చెయ్యడానికి యేమీ వుండదు కదా. కఱ్ఱతో నేలమీద మోదడం బాగా తెలుసు. వో వాచ్‌మన్ నాకు నేర్పాడు'' అన్నాడు.

ఆ వ్యవహారమంతా చిక్కు పడిపోయింది. త్వరగా నాన్న పైలట్ కావాలనుకున్నాడు. తర్వాత యాక్టర్ కావాలనుకున్నాడు. కాని తాతయ్య నాన్నని వో ఫాక్టరీకి తీసుకువెళ్లేక నాన్న టర్నర్ కావాలని అనుకున్నాడు. యివి గాక నావికుడు కావాలనీ అనుకున్నాడు. కనీసం పశువుల కాపరి కావాలని అనుకున్నాడు. చక్కగా కమ్చీకోల తిప్పుతూ ఆవుల మందల వెనక్కాలే నడుచుకుంటూ పోవచ్చు.

ఆఖరికి నాన్న కుక్క కావాలని అనుకున్నాడు. రోజంతా నాలుగు కాళ్లమీదా పరిగెడుతూ, కొత్త వాళ్లని చూసి మొరుగుతూ వున్నాడు. వో పెద్దావిడ ఆయన తల నిమరబోతే ఆమెని కరవబోయేడు కూడా. బాగా మొరగడం యెలాగో నాన్న నేర్చుకున్నాడు. కాని కాలితో చెవి వెనక్కాల గోక్కోవడం యెలాగో ఆయనకి పట్టుబడలేదు, యెంతగానో ప్రయత్నించేడు కూడా. అవతలకి వెళ్లి రోవర్ కుక్క దగ్గర కూర్చుంటే బాగా పట్టుబడుతుందని నాన్న అనుకున్నాడు. అలానే చేశాడు.

సరిగ్గా ఆ సమయంలో యెవరో ఆఫీసరు రోడ్డుమీద అటు వెడుతున్నాడు. అతను ఆగి నాన్నకేసి చూశేడు. కొంచెం సేపు నాన్నని పరకాయించి చూశేడు.

''యేమిటి చేస్తున్నావ్?'' అని అడిగేడు.

''నేను కుక్కని అవాలనుకుంటున్నాను'' అని నాన్న చెప్పేడు.

''మనిషి అవాలని అనుకోవడం లేదూ?'' అని అతను అడిగేడు.

''నేను చాలా కాలం మనిషి గానే వున్నాను'' అని నాన్న చెప్పేడు.

''యెలాంటి మనిషివయ్యా? కుక్క కూడా కాలేని వాడివి? మనిషంటే అలానేనా?''

''ఒహో! మనిషంటే మరి యెలా?'' అని నాన్న అడిగేడు.

''ఆ విషయం నువ్వే ఆలోచించుకో'' అన్చెప్పి ఆ ఆఫీసరు వెళ్లిపోయేడు.

అతను నవ్వనూ లేదు, కనీసం చిరునవ్వు కూడా నవ్వలేదు. కాని చిన్న నాన్నకి వున్నట్టుండి తన పట్ల తనకే సిగ్గనిపించింది. ఆయన ఆలోచించడం మొదలెట్టేడు. ఆలోచించేడు, యింకా

ఆలోచించేడు. ఆలోచించే కొద్దీ ఆయనకి తన పట్ల తనకే సిగ్గేసింది. ఆ ఆఫీసరు నాన్నకి యేమీ చెప్పలేదు, కాని తను రోజు రోజుకీ మనసు మార్చుకోకూడదని ఆయనకి అనిపించింది. అన్నిటి కంటే ముఖ్యం అయింది పెద్దయాక యేం కావాలనుకుంటున్నదీ తెలియనంతటి చిన్న వాడు తను! తర్వాత యెవళ్లేనా పెద్దయాక యేం కావాలనుకుంటున్నావని అడిగినప్పుడు నాన్న ఆఫీసరు అన్న మాటలు గుర్తు చేసుకునేవాడు.

''మనిషి కావాలని అనుకుంటున్నా'' అని చెప్పేవాడు.

అప్పుడు యెవళ్లూ నవ్వలేదు. అన్నిటికంటే ఉత్తమమైన సమాధానం యిదేనని నాన్నకి తెలిసింది. యిప్పటికీ అలానే అనుకుంటున్నాడు. మొట్టమొదటగా మీరు మంచి మనిషి అవాలి. అదీ పైలట్‌కి గాని, పశువుల కాపరికి గాని, ఐస్ క్రీమ్ అమ్మే వాడికి గాని ముఖ్యం అయిన విషయం. యింతా చేసి కాలితో చెవి వెనక్కాల బరుక్కోవడం మనిషికి తెలియక్కర్లేదు కదా.

# నాన్న సంగీతం విద్య



నాన్న చిన్న పిల్లాడిగా వున్నప్పుడు వాళ్ల అమ్మా, నాన్నా ఆయనకి అనేక రకాల ఆట వస్తువులు కొనిపెట్టేవారు. ఓ బంతి, లాటరీ ఆట వస్తువులు, నైన్‌పిన్స్ పిల్లల ఆట వస్తువులు, బొమ్మ కారు — యిలా అనేకం కొనిపెట్టేవారు. అప్పుడు వో రోజున పియానో కొనిపెట్టారు. కాని అది ఆట వస్తువు కాదు. అది అచ్చు ముచ్చు నిజమైన పియానో, నల్లగా నిగనిగ మెరిసే మూత వుంది దానికి. చాలా భారీ పియానో. దగ్గర దగ్గర గదిలో సగం చోటు ఆక్రమించింది అది.

"పియానో వాయించడం వచ్చా?" అని నాన్న తాతని అడిగాడు.

"ప్చ్, రాదు" అన్నాడాయన.

"పియానో వాయించడం వచ్చా?" అని నాన్న మామ్మని అడిగేడు.

"ప్, రాదు" అందావిడ.

"అయితే యిప్పుడు పియానోని యెవరు వాయిస్తారు?" అని నాన్న అడిగేడు.

"నువ్వు" అని తాతా, మామ్మా వొక్క సారే అన్నారు.

"కాని నాకూ తెలీదే."

"సంగీతం పాఠాలు నేర్చుకుందువు గాని" అని తాతయ్య అన్నాడు.

"నీకు సంగీతం పాఠాలు చెప్పే ఆవిడ పేరు నదేజ్దా ఫ్యోదొరొవ్నా" అని మామ్మ టీచర్ పేరు కూడా చెప్పేసింది.

తనకో అద్భుతమైన కానుకని యిచ్చేరని నాన్న వున్నట్టుండి గ్రహించేడు. అంతకు ముందె ప్పుడూ యే టీచరూ యింటికి రాలేదు. యెవరూ నేర్పకుండా తనకి తనే ఆట వస్తువులతో నాన్న ఆడుకునేవాడు.

అప్పుడు సంగీతం టీచర్ వచ్చింది. ఆమె పెద్దావిడ. మెతక మనిషి. ఆవిడ నాన్నకి పియానో వాయించి చూపించింది. తర్వాత సంగీత స్వరాల్ని బోధించడం మొదలుపెట్టింది. మొత్తం వున్నవి సప్తస్వరాలు: ఎ బి సి డి ఇ ఎఫ్ జి. నాన్నకి అవన్నీ గబగబా వచ్చేశాయి. వర్ణ మాల పుస్తకంలో అక్షరాల్లా ఆయన వాటన్నిటికీ బొమ్మలు గీసుకున్నాడు.

'ఎ' అంటే ఆపిల్, ఆయన ఆపిల్ బొమ్మ గీసుకున్నాడు. 'బి' అంటే బోయ్. ఆయన పిల్లాడి బొమ్మ గీసుకున్నాడు. 'సి' అంటే కేట్, పిల్లి బొమ్మ, 'డి' అంటే డాగ్ కుక్క బొమ్మ. 'ఎఫ్' ఫెన్స్ అని కంచె దడి గీసుకున్నాడు. 'జి' అంటే జిరాఫ్ అని జిరాఫ్ బొమ్మ గీసుకున్నాడు. నాన్నకి చాలా సంతోషం కలిగింది. కాని కొన్ని రోజుల్లోనే ఆయనకి పియానో నేర్చుకోవడం అంత తేలిక వ్యవహారం కాదని అర్థమైపోయింది. అదే అదే పదే పదే వాయించడంతో మొహం మొత్తింది. యేమైనా చదువుకోవడం లేకపోతే ఆడుకోవడం లేకపోతే యేమీ చెయ్యకుండా వొత్తినే కూర్చోవడం యెక్కువ సరదాగా వుంటుంది. రెండు వారాలు గడిచే లోపునే నాన్నకి సంగీతం పాఠాలు విసుగుపుట్టించేయి, పియానో చూస్తే వికారం వొచ్చి తిప్పేసేది. మొదట్లో నాన్న చురుకుదనం చూసి మెచ్చుకున్న నదేజ్దా ఫ్యోదొరొవ్నా యిప్పుడు విచారంగా తల వాలేసుకుంది.

"యేం నీకు సంగీతం పాఠాలు నచ్చలేదా?" అని అడిగింది.

"లేదు" అని నాన్న జవాబు చెప్పేడు. అలా చెప్పినప్పుడల్లా ఆమెకి కోపం వస్తుందనీ,

పాఠాలు చెప్పడం మానేస్తుందనీ నాన్న అనుకునేవాడు. కాని ఆమె మానలేదు.

మామ్మ, తాత నాన్నని తిట్టేరు.

"చూడు యెంత మంచి పియానో కొనిపెట్టేమో నీకు. నీకు చెప్పడానికి టీచర్ కూడా వస్తోందాయిరి. పియానో వాయించడం నేర్చుకోవద్దూ? ఫుఫ్, సిగ్గు చేటు" అన్నారు వాళ్లు.

"యిప్పుడు సంగీతం పాఠాలు వద్దంటాడు. రేపు బళ్లోకి వెళ్లనంటాడు. తర్వాత పని పాటా అర్థంలేని వంటాడు. అలాంటి సోమరిపోతు పిల్లలకి పని చెయ్యడం యెలాగో చిన్నప్పుడే నేర్పాలి. పియానో వాయించడం నేర్చుకు తీరాలి నువ్వు!" అని తాత అన్నాడు.

"నా చిన్నతనంలో నాకు సంగీతం నేర్పించి వుంటే యెంత బాగుండేదో అని యిప్పుడు నేను బాధ పడుతూ వుంటే!" అంది మామ్మ.

"చాలు, సంతోషం. నాకు సంగీతం పాఠాలు వద్దు" అని చిన్న నాన్న అన్నాడు.

తర్వాత నదేజ్దా ఫ్యోదొరొవ్నా వచ్చినప్పుడు నాన్న కనిపించకుండా మాయమైపోయేడు. ఆయన కోసం యిల్లంతా వెతికారు. వీధంతా వెతికారు, కాని ఆయన జాడలేదు. పాఠం అయిపోయే టైమ్ దగ్గర పడుతూ నాన్న మంచం కిందనుంచి పాక్కుంటూ వచ్చేడు.

"గుడ్‌బై, నదేజ్దా ఫ్యోదొరొవ్నా" అన్నాడు.

"నువ్వు యిలాంటి పని చేస్తున్నందుకు యేడుస్తావులే" అన్నాడు తాతయ్య.

"నేను తర్వాత వీడి భరతం పడతా" అంది మామ్మ.

"యేం ఫర్లేదు, సంగీతం పాఠాలు యిక లేనంత కాలం" అని నాన్న తెగించి అన్నాడు.

అని భోరున యేడుపు లంకించుకున్నాడు.

యింతా చేసి నాన్న అప్పుడు చిన్న పిల్లవాడే కదా. ఆయనకి సంగీతం పాఠాలంటే అంత అసహ్యం అనిపించింది. అప్పుడు సంగీతం టీచరు అంది:

"సంగీతం మనుషులకి సంతోషకరంగా వుండాలి. నా దగ్గర నేర్చుకునే వాళ్లెవరూ యెప్పుడూ మంచాల కింద దాంకోలేదు. మంచం కింద గంట సేపు దాంకోవడం మంచిదిగా కనిపించిన పిల్లాడికి సంగీతం నేర్చుకోవడం యిష్టం లేదన్న మాట. అలాంటప్పుడు బలవంతం చేసి లాభమూ లేదు. పెద్దయాక విచారిస్తాడు బహుశా. యిక సెలవిప్పించండి నాకు. దాంకోకుండా సంగీతం అంటే యిష్టపడే పిల్లలకి చెపుతాను."

అలా అని ఆవిడ వెళ్లిపోయింది. తర్వాత మళ్లీ రాలేదు. తాతయ్య నాన్నని వదల్లేదు, చివాట్లు పెట్టి నాలుగు వడ్డించేడు. ఆయన వంతు పూర్తయాక మామ్మ కూడా నాన్న భరతం

పట్టింది. కాని తర్వాత చాలా కాలం దాకా పియానో పక్కనుంచి వెడుతూ వుంటే నాన్న ముఖం నల్లగా మాడిపోయేది.

నాన్న పెద్దయాక తనకి సంగీతం పట్ల అభిరుచి లేదు అని గ్రహించేడు. యిప్పటికీ ఆయన వొక్క పాటని అపస్వరం లేకుండా పాడలేడు. పాపం, పియానోని జన్మలో నేర్చుకోగలిగి వుండేవాడు కాదు.

వూఁ, కదా, పిల్లలందరికీ పియానో విద్య వంట బట్టదు.

## నాన్న రొొట్టెని నేలకేసి కొట్టడం



నాన్న చిన్నప్పుడు తనకి రుచిగా వుండే వాటన్నిట్నీ యిష్టంగా తినేవాడు. ఆయనకి మాంసం కూర యిష్టం. జున్ను యిష్టం. మాంసం ఉండలు యిష్టం. కాని రొొట్టె అంటే సరి పడేది కాదు. "రొొట్టె తినడం మర్చిపోకేం" అని పదే పదే చెబుతూ వుండడమే అందుకు కారణం.

రొొట్టె కూడా రుచిగా వుండదులెండి. రొొట్టె తింటే జిహ్వ లేచి వస్తుందా యేమన్నానా? అలా అని కొంటె చిన్న నాన్న అనుకునేవాడు. నాస్తా అప్పుడు గాని, భోజనాలప్పుడు గాని ఆయన రొొట్టెని తినేవాడే కాదు. యేవూటా తినేవాడు కాదు. ఆయన తనకి పెట్టిన రొొట్టెని చిన్న చిన్న ఉండలుగా చేసేవాడు. పెచ్చులు వదిలేసేవాడు. రొొట్టె ముక్కని టేబిల్ క్లాత్ కింద

దాచేసేవాడు. తన రొట్టెని తనప్పుడే తినేశానని చెప్పేవాడు. కాని వొట్టిది. తను పెద్దయాక రొట్టెని తినను గాక తినను అని తీర్మానం చేసేసుకున్నాడు. తన పిల్లల్ని కూడా రొట్టె తినమని అనడు, అంతే!

''రొట్టె తినే అవసరం లేకపోతే యెంత బాగుంటుంది!'' అని అమాయకంగా నాన్న అనుకునే వాడు. '' 'యివాళ నాస్తాకి యేం తిందాం! జున్ను?' అంటాను. అయితే రొట్టె లేకుండా తిందాం. మాంసం కూర కూడా రొట్టె గిట్టె లేకుండానే తిందాం. సూప్‌తో గాని, మాంసంతో గాని రొట్టె తినం. రేప్పొద్దున్న రొట్టె తినక్కర్లేదు అనుకుంటూ యివాళ నిద్రపోవడం యెంత హాయిగా వుంటుంది!'' అలా అని నాన్న అనుకునేవాడు. కాని నాన్న పెద్దయే దాకా ఆగలేదు.

తాత, మామ్మ, యింకా చాలా మందీ నాన్నకి చెప్పారు ఆయన అనుకుంటూ వున్నది తప్పని. కాని ఆయన వినలేదు. రొట్టె ఆయనకి మంచిదని వాళ్ళ చెప్పేరు. చెడ్డ పిల్లలు, తెలివి తక్కువ పిల్లలు మాత్రమే రొట్టె తినరని కూడా వాళ్ళ చెప్పేరు. రొట్టె తినకపోతే జబ్బు చేస్తుందనీ చెప్పారు. రొట్టె తినకపోతే తన్నులు తగులుతాయనీ చెప్పారు. అయినా కూడా నాన్నకి రొట్టె యిష్టం లేకపోయింది.

ఓ సారి ఘోరమైన విషయం జరిగింది. చిన్న నాన్నకి బాగా ముసలిదైన ఆయా వొకావిడ వుండేది. ఆవిడకి నాన్నంటే ప్రాణం. కాని ఆయన భోజనాల బల్ల దగ్గర అల్లరి చేస్తే ఆవిడకి చెడ్డ కోపం వచ్చేసేది. ఓ రోజున తాతా మామ్మ యెక్కడికో వెళ్ళారట. చిన్న నాన్న వొక్కడూ సాయంత్రం భోజనం చేస్తున్నాట్ట. యెప్పటిలాగానే ఆయన రొట్టె తినడం లేదట.

''రొట్టె తిను, తింటే గాని యింకేమీ పెట్టను'' అంది ఆయా.

''వుహుఁ, తినను'' అని చిన్న నాన్న అన్నాడు.

రొట్టె ముక్కని నేలకేసి కొట్టేడట. ఆయాకి చెడ్డ కోపం వచ్చేసి నోట మాట రాలేదు. ఆవిడ నాన్నని తిట్టి పోసినా బావుండేది. మాటా పలుకూ లేకుండా నాన్నకేసి చూస్తూ వుండి పోయింది.

ఆఖరికి చెప్పింది:

''నువ్వేదో వో రొట్టె ముక్కని నేలకేసి కోట్టేనని అనుకుంటున్నావు, కదా? కాని తప్పు. అదేమిటో చెప్తాను. నా చిన్నప్పుడు చిన్న రొట్టె ముక్క కోసం రోజంతా బాతుల మందని కాయాల్సివచ్చేది. వో శీతాకాలంలో మాకు అస్సలు ధాన్యం గింజ మిగల్లేదు. మా తమ్ముడు నీ

అంత వుండేవాడు, ఆకలికి మాడి చచ్చిపోయేడు. యేవరేనా ధర్మాత్ములు వాడికింత రొట్టె ముక్క పెట్టి వుంటే పాపం వాడు ప్రాణంతో నిలబడేవాడే. నీకు చదువుకోవడం రాయడం నేర్పుతారు గాని రొట్టె ముక్క యెక్కణ్నుంచి వస్తుందో వాళ్లు చెప్పరు. మనుషులు ధాన్యం పండించి రొట్టె చెయ్యడానికి చాలా కష్టపడి పని చేస్తారు. నువ్వేమో నేలకేసి కొడుతున్నావు. సిగ్గు చేటు! నీ మొహం నాకు చూపించకు.''

చిన్న నాన్న మంచం యెక్కేడు నిద్రపోవడానికి. కాని ఆయనకి సరిగా నిద్రపట్టలేదు. ఘోరమైన పీడకలలు. మర్నాడు పొద్దుట నాన్న లేచాక తనకి శిక్షగా రోజంతా రొట్టె ముక్క పెట్టరని ఆయనకి చెప్పారు. అంతకు ముందు నాన్నకి భోజనాల ఆఖర్న తినే స్వీట్‌ని చాలా సార్లు పెట్టేవాళ్లు కాదు. ఒకో అప్పుడు రాత్రి భోజనం లేకుండా కూడా పడుకోవాల్సి వచ్చేది. కాని రొట్టె ముక్క లేకుండా చెయ్యడం అనేది యిదే మొదటి సారి. అది ఆయా ఆలోచన. భలే ఆలోచన. నాన్నకి రొట్టె లేకుండా నాస్తాలో జున్ను శాండ్‌విచ్‌ని పెట్టేరు. అది చాలా రుచిగా వుంది, నాన్న దాన్ని క్షణంలో తినేశాడు. నాస్తా తిన్నాక కూడా నాన్నకి ఆకలి తీరలేదు. రొట్టె లేదుగా! మధ్యాహ్నం భోజనాల వేళ దాకా ఆయన ఆగలేకపోయేడు. రొట్టె లేకుండా మాంసం ఉండ మాత్రం కడుపు నింపు తుందా? రోజంతా రొట్టెకి ఆకలిగానే వుంది. రాత్రి భోజనాలప్పుడు గుడ్లు ఆబగా తిన్నాడు. రొట్టె లేకుండా అదేమన్నా రుచిగా వుంటుందా?

ప్రతి వాళ్లూ నాన్నని చూసి నవ్వేరు. వొక యేడాది పాటు ఆయినకి రొట్టె వుండదని చెప్పారు. కాని ఆ మర్నాడు పొద్దుట వో రొట్టె ముక్కని పెట్టేరు. యెంత రుచిగా వుందో అది. యెవళ్లూ వొక్క మాట కూడా అనలేదు. కాని నాన్న రొట్టెని తినడం ప్రతివాళ్లూ పరిశీలనగా చూశేరు. చిన్న నాన్నకి చాలా సిగ్గనిపించింది. అప్పట్నుంచీ ఆయన యెప్పుడూ రొట్టె తినకుండా వదల్లేదు. యెప్పుడూ దాన్ని నేలకేసి విసిరి కొట్టలేదు.

# నాన్న అయిన దానికీ కాని దానికీ నొచ్చుకోవడం



నాన్న చిన్న పిల్లాడిగా వున్నప్పుడు యెప్పుడూ ప్రతి దానికీ నొచ్చుకుంటూనే వుండే వాడట. ఆయనకి ప్రతి వాళ్ల పట్లా ఉమ్మడిగానూ, విడివిడిగా అందరి పట్లా కోపంగా వుండేదట. యెవళ్లేనా ''యెందుకలా తిండిని కెక్కరిస్తావు?'' అంటే కోపం, ''యెందుకలా మెక్కేస్తున్నావు?'' అంటే కోపం.

ఆయనకి మామ్మ అంటే కోపం. తనేదో ఆవిడకి చెప్పాలనుకునేవాడు, ఆవిడకేమో తీరిక

లేక వినేది కాదు. తాతయ్యంటే కోపం, యేమంటే తనకి ఆయన యేదో చెప్పాలనుకుంటే తనకి తీరిక లేక వినలేకపోవడం అందుకు కారణం. మామ్మా తాతా యెవళ్ల యింటికేనా చూడ్డా నికి వెళ్లినా, వో థియేటరుకి వెళ్లినా చిన్న నాన్నకి కోపం వచ్చి యేడ్చేవాడట. వాళ్ల యెక్కడికీ వెళ్లకుండా తన దగ్గర యింట్లోనే అస్తమానూ వుండి పోవాలనట ఆయనకి! కాని తను సర్కస్‌కి వెళ్లాలనుకున్నప్పుడు చిన్న నాన్న యింకా గట్టిగా యేడ్చేవాడట. ఆయనకి తను యింటి దగ్గర వుండాల్సివచ్చిందే అని కోపమట.

నాన్న తమ్ముడు మా పీత్య బాబయ్య. అప్పుడు బాబయ్య యింకా చిన్నగా వుండేవాడు. ఆయనంటే నాన్నకి కోపం వచ్చేది, ఆయన తనతో మాట్లాడలేకపోయేవాడు అని. పీత్య బాబయ్య నాన్నని చూసి నవ్వుతూ బొద్దుగా వుండే కాలి బొటన వేలిని నోట్లో పెట్టుకునేవాడు. ఆయన చాలా చాలా చిన్నగా వుండి 'ద, ద' అని మాత్రమే అనగలిగేవాడు. అయినా నాన్న కోపం నాన్నదే. అత్త చూడ్డానికి వస్తే ఆవిడమీద కోపం. మామయ్య చూడ్డా నికి వస్తే ఆయనంటే కోపం. అత్తయ్య, మామయ్య కలిసే చూడ్డానికి వస్తే యిద్దరి మీదా కలిసే నాన్నకి కోపం వచ్చేది. అత్తయ్య తనని వేళాకోళం చేస్తోందేమోనని వొకో అప్పుడు ఆయనకి అనిపించేది. మామయ్యకి తనతో మాట్లాడ్డం యిష్టం లేనట్టు వొకో అప్పుడు నాన్నకి అనిపించేది. నాన్నకి వేరే కారణాలూ తట్టి కోపం వచ్చేది.

యీ విశాల ప్రపంచంలో తను చాలా ముఖ్యమైన వాణ్ణని నాన్నకి అనిపించేది. తను యేదన్నా చెప్పదలచుకున్నప్పుడు ప్రతి వాళ్లూ యేం మాటా పలుకూ లేకుండా చెప్పేది వినాల్సిందే. తనకి మాట్లాడా లనిపించినప్పుడు యెవళ్లూ మాట్లాడకూడదు.

తనకి మ్యావ్‌మ్యావ్ అనాలనిపించినా, మొరగాలనిపించినా, గుర్రుమనాలనిపించినా, కావ్‌కావ్ మనాలనిపించినా ప్రతి వాళ్లూ చేసే చేసే పని అలావే వొదిలేసి తన అద్భుతమైన కూతలు వినా ల్సిందే. వేరే వాళ్లు వున్నారనీ, పెద్దలూ పిన్నలూ వున్నారనీ, అందరూ తనకి లాంటి వాళ్లేననీ చిన్న నాన్నకి అనిపించేదే కాదు. యెవళ్లన్నా నాన్నతో వాదించి ఆయన్ని సరిదిద్దబోతే చిన్న నాన్నకి కోపం వచ్చేది. చాలా చిరాగ్గా వుండేది. ఆయన మూతి బిగించుకుని, ముఖం చిట్లించుకుని, విసురుగా వెళ్లిపోయేవాడు.

ఆయనకి యెప్పుడూ యెవళ్లమీదనో యెందుకో కోపం వస్తూనే వుండేది. యెవళ్లతోనో వాదిస్తూనే వుండేవాడు, నొచ్చుకుంటూనే వుండేవాడు. పొద్దుట్నుంచి సాయంత్రం దాకా బుజ్జ

గించి, బతిమాలి బామాలి సవరిస్తూ వుండాల్సిందే ఆయన్ని. పొద్దున్నే నిద్ర కళ్లు తెరిచిం దగ్గర్నుంచీ కోపమే. యేమంటే యెండ పడి మెలుకువ వచ్చేసింది తనకి! నిద్ర పోయినప్పుడు కూడా రాత్రి మూతి విరుచుకుని యెవరిమీదనో కోప్పడేవాడు. వేరే పిల్లలతో చిన్న నాన్న ఆడుకునేటప్పుడు యింకా పాడుగా వుండేది. తనకి యిష్టమైన ఆటలే అందరూ ఆడాలని ఆయన అనేవాడు. కొంత మంది పిల్లలతోనే ఆయన ఆడుకోవాలనుకునేవాడు, వేరే వాళ్లతో కాదు. వాదనలో యెప్పుడూ తన మాటే నెగ్గాలనేవాడు. తను మాత్రం అందర్నీ ఆట పట్టించాలనుకునేవాడు గాని తనని మాత్రం యెవళ్లూ యేమీ అనకూడదు. కొంత కాలం అయేక అందరికీ వినుగొచ్చింది. అందరూ చిన్న నాన్నని చూసి నవ్వేవారు.

"టీ తాగుతావా? మూతి ముడుచుకోకు" అని నాన్న వాళ్ల అమ్మా, నాన్నా అనేవాళ్లు.

"షికారుకి వెడదాం పద, మూతి ముడుచుకోకు."

"యేం యింకా అలక తగ్గలేదా?"

"వూఁ గబగబా! అలక కానీ! టైమ్ లేదు" అనేవాళ్లు.

చిన్న నాన్నకి కోపం వచ్చేది. వీధిలో పిల్లలు ఆయన్ని ఉడికించేవాళ్లు.

"ఏడు, బాబూ! ఏడు" అని పాడేవాళ్లు. చిన్న నాన్న బుంగ మూతి పెట్టు కునేవాడు.

"యిదుగో చూడండి! నేను వేలిని యిటూ అటూ వూపుతా, దానిక్కూడా వాడికి కోపం వచ్చేస్తుంది."

ఓ కుర్రాడు వేలు వూపేవాడు. నాన్నకి కోపం వచ్చేసేది. అప్పుడందరూ నవ్వేవాళ్లు. మిగిలిన పిల్లలందరికీ సరదాగా వుండేది యేమంటే నాన్నని ఉడికించడం భలే తేలిక. నిజంగా వాళ్లు ఆయన్ని బాగా ఉడికించేశారు. వో పెద్ద కుర్రాడు నాన్నమీద జాలిపడ్డాడు.

"యెందుకు అలా అయిన దానికీ కాని దానికీ నొచ్చుకుని బాధపడతావ్? నువ్వేం పట్టించు కోకుండా వదిలేస్తే వాళ్లు యేమీ ఉడికించరు" అని చెప్పాడు.

నాన్న అతని సలహా విన్నాడు. అయిన దానికీ, కాని దానికీ నొచ్చుకోవడం మానేశాడు. పిల్లలు ఆయన్ని ఉడకించడం మానేశారు. కాని ఆయన కోప్పడానికి బాగా అలవాటు పడిపోయిందాని వల్ల పెద్దయే దాకా అది పూరా పోలేదు. పెద్దయాకా పూర్తిగా పోలేదు. ఆ అలవాటు బళ్లో,

తర్వాత ఉద్యోగంలో వుండనే వుంది. చాలా మంది ఆయన స్నేహం వొదిలేసి వెళ్లిపోయారు. నాన్నని చిన్నప్పట్నుంచీ యెరిగి వున్న కొంత మంది యింకా ఆయన్ని ఉడికిస్తూనే వుంటారు. కాని యిప్పుడాయన వాళ్లమీద కోపం తెచ్చుకోడు. అసలు కోపపడడు. యేమైన అప్పటంత కానే కాదు.

# నాన్న పొరపాటు చెయ్యడం




నాన్న చిన్న పిల్లాడిగా వున్నప్పుడు పాలు, నీళ్ళు, టీ, కాడ్ లివర్ ఆయిలు తాగుతూ వుండేవాడు.

ఎదిగే పిల్లలకి కాడ్ లివర్ ఆయిల్ చాలా మంచి దంటారు. కాని, అబ్బ! చెడ్డ వాసన. లోకంలో కాడ్ లివర్ ఆయిల్ కంటే దరిద్రమైంది లేదని నాన్న అభిప్రాయం. కాని ఆయన పొరపాటు పడ్డాడు.

వేసవి కాలంలో వో రోజున ఆయన బయట ఆడుకుంటున్నాడు. చాలా వేడిగా వుంది. నాన్న ఆటల్లో పరుగులు తీస్తూ వుండడంతో ఆయనకి గొంతుక పిడచ కట్టుకుపోయింది. యింట్లోకి పరిగెత్తి వెళ్లాడు. యింట్లో అంతా యెవళ్ల పనుల్లో వాళ్లు వున్నారు. పిండి వంటలు వండుతు న్నారు, అతిథుల కోసం బల్లలు సర్దుతున్నారు.

నాన్న చిన్న గాజు కూజాలోనుంచి గ్లాసులోకి నీళ్లు పోసుకోవడం యెవళ్లూ చూడలేదు. చల్లని నీళ్లు గాజు కూజాలో పోసి వుంచుతారని నాన్నకి తెలుసు. ఓ అరగ్లాసు గటగట తాగేడు... పొలమారింది. యేం జరిగిందో ఆయనకి తెలీలేదు.

బతికున్న ముళ్ల పందిని మింగినట్టుగా వుంది ఆయనకి. నీళ్లు మంచివేగాని తనకే యేదో జరిగిందని ఆయనకి అనిపించింది. ఆయనకి చాలా భయం వేసేసింది. తను చనిపోతున్నాడేమో అనిపించింది. గట్టిగా అరిచేసేడు. దాంతో యెక్కడెక్కడి వాళ్లూ పరిగెత్తుకు వచ్చేరు.

చిన్న నాన్న దగ్గుతున్నాడు, ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. ఆయన నోరు మండిపోతోంది. చాలా ఘోరంగా వుంది. యేం జరిగిందో యేమిటో యెవళ్లకీ బోధపడలేదు.

"చాలా జబ్బు పడిపోయేడు" అని మామ్మ రాగం తీసింది.

"నాటకం ఆడుతున్నాడు" అన్నాడు తాతయ్య.

యేం పొరపాటు జరిగిందా అని చూడ్డానికి ఆయా వచ్చింది. యేం జరిగిందో ఆవిడ వూహించింది.

"వాడు వోద్కా తాగేడు! ఆ గాజు కూజాలో వోద్కా వుంది!" అంది.

ప్రతి వాళ్లూ అరవడం మొదలెట్టేరు.

"డాక్టర్ని పిలవండి" అని మామ్మ అరిచింది.

"పీడి తాట వొలుస్తాను" అని తాత అరిచేడు.

"వాడికి తిండానికి యేదన్నా పెట్టండర్రా" అని ఆయా అంది.

చిన్న నాన్న శాండ్‌విచ్‌ని కొరికి నమిలేడు.

"వోద్కా బలం యిస్తున్నట్టే వుంది" అన్నాడు.

వున్నట్టుండి చిన్న నాన్నకి పరిస్థితి దిగజారినట్టనిపించింది. నేలమీద కూలబడిపోయేడు. తల తిరిగిపోతున్నట్టుగా వుంది.

ఆ తర్వాత యేం జరిగిందో చిన్న నాన్నకి గుర్తులేదు. కాని రోజంతా నిద్రపోయాట్ట. సాయంత్రం వేళకి మెరుగనిపించిందట. అతిథులు వచ్చి వోద్కా తాగుతూ వుంటే నాన్న వాళ్లకేసి

తలుపు సందులోనుంచి చూశేట్ట. అయ్యొయ్యో అని వాళ్లని చూసి జాలి పడ్డాడట. వాళ్లకి యెంత ఘోరంగా వుంటుందో ఆయనకి తెలుసు.

''ఆ దరిద్రపు గొట్టు దాన్ని తాగకండి'' అని వొకాయనతో అన్నాడట కూడా.

కాని ఆ తెలివి తక్కువ పెద్దమనిషి వూరికే నవ్వాడు.

ఆ మర్నాడు పొద్దుట నాన్నకి బాగా వున్నట్టు అనిపించింది. కాని మళ్లీ ఆ గాజు కూజాలో నుంచి తాగితే వొట్టు. యెప్పుడేనా వోద్కా కనిపిస్తే కొంచెం నిరాసక్తంగా వుంటుంది.

నాన్న యీ వృత్తాంతం యెక్కువ సార్లు చెప్పేవాడు.

''అదుగో! అప్పటినుంచే నేను తాగడం మానేశాను'' అని అంటూ వుంటాడు.

# నాన్న రాత నేర్చుకోవడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి చదవడం గబగబా వచ్చేసింది. యిది అ, యిది ఆ అని చెప్పగానే ఆయన పట్టేసుకునేవాడు. అలా అన్ని అక్షరాలూ నేర్చేసుకున్నాడు. భలే సరదాగా వుంది. పుస్తకాలు చదవడం మొదలుపెట్టేడు, వూరికే బొమ్మలు చూడడం కాదు. కాని చిన్న నాన్నకి రాయడం నేర్చుకోవాలని వుండేదే కాదు. పెన్ సరిగా యెలా పట్టుకోవాలో ఆయనకి తెలిసేదే కాదు. అలా అని తప్పు పద్ధతిలో పట్టుకోవడమూ యిష్టం వుండేది కాదు. ఆయనకి యిష్టం అయింది చదవడం, రాయడం కాదు. చదవడం సరదాగా వుండేది, రాయడం విసుగ్గా వుండేది.

కాని ఆయన అమ్మా నాన్నా చెప్పారు:

"రాయడం రాకపోతే నువ్వు చదవడానికి ఒప్పుకోం."

"వూఁ, ఆ అక్షరాలన్నీ రాయి" అని కూడా చెప్పారు.

పొద్దున్నుంచి సాయంత్రం దాకా రోజంతా నాన్న ఆ ముక్కలే వినేవాడు. మహా విసుగు పడిపోతూ ఆయన అక్షరాలు రాసేవాడు.

ఆయన రాత దారుణంగా వుండేది. అక్షరాలు వంగిపోయి, గూని గుర్రాల్లా పడుకునేవి. వాటికేసి చూడడం నాన్నకే అసహ్యంగా వుండేది.

నిజంగా అక్షరాలు కలగాపులగంగా వుండేవి. కాని సిరామరకలు అద్భుతంగా వుండేవి. అంత పెద్ద అందమైన సిరామరకల్ని నాన్నకిలాగా యెవరూ చెయ్యలేరు. ఆ విషయం అందరూ అంగీకరించేరు. సిరామరకల ద్వారా జనం నేర్చుకోగలిగితే ప్రపంచంలో నాన్న దస్తూరీ అంత మంచి దస్తూరీ యెవళ్లకీ వుండదు.

ఒక్క అక్షరం తిన్నగా, వుండాల్సినట్టు వుంటే ఒట్టు. ప్రతి పేజీలోనూ అందమైన పెద్ద మచ్చలు వుండేవి.

నాన్నని అవమానించి తిట్టేవాళ్లు. ప్రతి అక్షరాన్ని తిరగ రాయించేవాళ్లు, రెండేసి మూడేసి సార్లు. కాని యెన్ని సార్లు రాస్తే అంత అధ్వాన్నంగా తయారయేవి, మచ్చలు అంత పెద్దవి అయేవి.

యెందుకు తనని క్షోభపడుతున్నారో ఆయనకి బోధపడేది కాదు. యింతా చేసి మాటలు చదవడం ఆయనకి తెలుసు కదా. యిప్పుడాయనకి మాటలు రాయాలనిపించింది, అక్షరాలు కాదు. కాని నీకు అక్షరాలు రాకపోతే మాటలు రాయడం రాదని వాళ్లు అనేవారు. వాళ్లన్న ముక్కలు ఆయన నమ్మలేదు. ఆఖరికి ఆయన్ని బళ్లో వేశాక ఆయన యెంత బాగా చదివేదీ, యెంత అధ్వాన్నంగా రాసేదీ చూసి అందరికీ ఆశ్చర్యం కలిగింది. స్కూల్లో పరమ దరిద్రంగా వుండే దస్తూరీ ఆయనదే.

చాలా యేళ్లు గడిచేయి. చిన్న నాన్న పెద్దవాడయేడు. యిప్పటికీ ఆయనకి చదవడం యిష్టం. రాయడం మంట. ఆయన దస్తూరీ యెంత పాడుగా వుంటుందంటే కావాల్సికి ఆయన అలా రాస్తున్నాడని అందరూ అనుకుంటారు.

ఒకో అప్పుడు నాన్న చాలా యిబ్బంది పడిపోయేవాడు.

మొన్న ఆయన పోస్టాఫీసుకి వెళ్లేడు.

"మీకు రాయడం చేత కాదా యేమిటి?" అని అక్కడి గుమాస్తా అడిగేడు.

నాన్నకి కష్టం తోచింది.

"యెందుకు రాదు? లక్షణంగా వచ్చు" అన్నాడు.

"అలాగా, అయితే యీ అక్షరం యేమిటో చెప్తారా?" అని గుమాస్తా అడిగేడు.

"అది 'ఉ'" అని నాన్న రహస్యం చెప్తున్నట్టుగా అన్నాడు.

"యేమిటి 'ఉ' అక్షరమా? యెవళ్లన్నా యిలా రాస్తారా దీన్ని?"

"నేను రాస్తా" అని నాన్న నీళ్లు నమిలేడు.

అందరూ నవ్వేరు.

దస్తూరీ అందంగా, ముత్యాలకోవలాగా వుండాలని నాన్న యెంత ఆశపడ్డాడు! మచ్చలు లేకుండా రాయచ్చు అప్పుడు. పెన్ను సరిగ్గా పట్టుకోవడం నేర్చుకుని వుంటే యెంత బాగుండేది! సరిగా అక్షరాలని దిద్దుకుని మంచి దస్తూరీ నేర్వనందుకు యెంత బాధ పడుతున్నాడాయన. కాని యిప్పుడు చెయ్యగలిగిందేమీ లేదు. అంతా ఆయన చేజేతులా చేసుకున్నదే.

# నాన్న వీత్య బాబయ్యని వొంటరిగా వదిలెయ్యడం



నాన్న చిన్నగా వున్నప్పుడు ఆయన తమ్ముడు యింకా చిన్నగా వుంటాడు కదా.

నాన్న తమ్ముడే మా వీత్య బాబయ్య. ఆయన యిప్పుడు ఇంజనీరు, ఆయనకి వో కొడుకు. అతని పేరూ వీత్యాయే.

కాని అప్పట్లో వీత్య బాబయ్య చిన్నవాడు కదా. అప్పుడే ఆయనకి నడక వచ్చింది. ఒకో అప్పుడు తప్పటడుగులు వెయ్యడం కంటే పాకడం ఆయనకి బాగా వుండేది. ఒకో సారి వొట్టినే

కూర్చుండిపోయేవాడు. అందుకని ఆయన్ని వొళ్ళాణ్ణీ వదిలిపెట్టి వుండడానికి లేకపోయేది. ఆయనంత చిన్న వాడుగా మరి.

ఓ రోజున చిన్న నాన్న, బుజ్జి బాబయ్య పెరట్లో ఆడుకుంటున్నారు. వాళ్ల మానాన వాళ్లని కాసేపు వదిలిపెట్టేశారు. సరిగ్గా ఆ సమయంలో బంతి వీధిలోకి దొర్లిపోయింది. నాన్న బంతి కోసం పరిగెట్టేడు. పీత్య బాబయ్య నాన్న వెనక్కాల పాక్కుంటూ వెళ్లాడు.

వాళ్ల యిల్లు మిట్టమీద వుండేది. బంతి మిట్టమీద నుంచి దొర్లుకుంటూ పడిపోయింది. నాన్న బంతి వెనక్కాలే పరిగెత్తేడు. పీత్య బాబయ్య నాన్న వెనకాలే పాక్కుంటూ వెళ్లేడు.

మిట్ట దిగువన రోడ్డు వుంది. బంతి అక్కడ ఆగింది. చిన్న నాన్న ఆఖరికి దాన్ని పట్టుకున్నాడు. బుజ్జి పీత్య బాబయ్య కూడా నాన్నని అందుకున్నాడు.

బంతే నాన్నకంటే, బాబయ్యకంటే బాగా చిన్నదిగా వున్నా దానికి యేమీ అలుపు రాలేదు. చిన్న నాన్న కొంచెం అలిసిపోయేడు. బుజ్జి బాబయ్య యెంతగానో అలిసిపోయేడు. పాపం అప్పుడప్పుడే కదా ఆయన నడక నేర్చుకున్నాడు. అంచేత ఆయన సరిగ్గా నట్టనడి రోడ్డుమీద కూలబడ్డాడు.

దూరంలో దుమ్ము లేస్తూ వున్నట్టు కనిపించింది. చాలా మంది గుర్రాలమీద స్వారీ చేసుకుంటూ రావడం కనిపించింది. వాళ్లు రోడ్డుమీద దౌడు తీయించుకుంటూ వస్తున్నారు. యిదంతా జరిగింది, యేనాడో లెండి, యుద్ధం ముగిసిన వెంటనే.

యుద్ధం అయిపోయిందని చిన్న నాన్నకి తెలుసు. కాని ఆయన బెదిరిపోయేడు. బంతిని వదిలేసి, పీత్య బాబయ్యని రోడ్డు నడి మధ్యలో వదిలేసి యింటికి పరిగెత్తి వెళ్లిపోయేడు.

పీత్య బాబయ్య అక్కడ్నే కూలబడి బంతితో ఆడుకుంటూ వున్నాడు. ఆయన గుర్రాలకీ, సైనికులకీ భయపడలేదు. అసలు ఆయన చాలా చాలా చిన్న పిల్లాడు కదా.

ఆశ్వికులు ఆపాటికి ఆయన దగ్గరికి వచ్చేశారు. కమాండర్ తెల్ల గుర్రంమీద స్వారీ చేస్తున్నాడు.

"ఆగండి" అని అతను అరిచేడు. గుర్రంమీదనుంచి కిందికి దిగి పీత్య బాబయ్యని యెత్తుకుని గాలిలో పైకి యెగరేసి మళ్లీ పట్టుకున్నాడు.

"వూఁ, యేమిటి విశేషాలు?" అని నవ్వేడు.

పీత్య బాబయ్య కూడా నవ్వేడు. అతనికి బంతి అందించేడు. యీ లోపున తాత, మామ్మ, చిన్న నాన్న మిట్టమీదనుంచి ఉరకలు పరుగులమీద వచ్చేరు.

''మా బాబూ! బాబూ! యెక్కడ?'' అని మామ్మ అరుస్తూ వుంది.

''అరవకు'' అని తాత అరుస్తున్నాడు.

చిన్న నాన్న వొకటే యేడుపు.

''యిదుగో మీ బాబు! భలేవాడు! గుర్రాలన్నా భయం లేదు మీ వాడికి'' అని కమాండర్ అన్నాడు.

కమాండర్ పీత్య బాబయ్యని మళ్లీ గాలిలోకి యెగరేసి పట్టుకుని మామ్మకి అందించేడు. తాతయ్యకి బంతి అందించేడు. అప్పుడు నాన్నకేసి చూశేడు.

''ఆడ జింకకంటే వేగంగా పరిగెత్తిపోయావే!'' అన్నాడు.

అందరూ నవ్వేరు. తర్వాత ఆశ్వికులు వెళ్లిపోయేరు. తాత, మామ్మ, నాన్న, పీత్య బాబయ్య యింటికి వెళ్లేరు.

''ఆడ జింకకంటే వేగంగా పరిగెత్తిపోయేడు! యేమంటే పిరికి వాడు కాబట్టి. యిది లేర్మొంతొవ్ పద్యంలోది. సిగ్గు! సిగ్గు!'' అని తాత నాన్నని చూసి అన్నాడు.

చిన్న నాన్నకి చాలా సిగ్గయింది.

పెద్దయాక లేర్మొంతొవ్ పద్యాలన్నీ చదివినప్పుడు యీ పాదం దగ్గర ఆయనకి చాలా చెడ్డగా అనిపించేది.

## అమ్మాయితో నాన్న ఆటలు



నాన్న చిన్నప్పుడు ఆయనకి మాషా అనే పేరు వున్న వో స్నేహితురాలు వుండేది. ఆమె చిన్న పిల్ల. నాన్నా, ఆమె యెప్పుడూ కలిసి సరదాగా ఆడుకుంటూ వుండేవారు. చక్కని పిచిక గూళ్ళు కట్టుకునేవాళ్ళు. కాగితం పడవలు తయారు చేసుకుని కుంటలో వదిలేవాళ్ళు. ఆ కుంటలోనే చేపల్ని పట్టేవాళ్ళు. యెప్పుడూ వొక్క చేపని కూడా పట్టుకోకపోయినా వాళ్ళ ప్రయత్నం చాలా గొప్పగా వుండేది.

నాన్నకి మాషాతో ఆడుకోవడం చాలా యిష్టం. ఆమె నాన్నతో యెప్పుడూ దెబ్బలాడేది కాదు, ఆయనమీదకి రాళ్ళు విసిరేది కాదు, యెప్పుడూ కాలుమడం వేసి పడగొట్టేది కాదు. నాన్నకి

తెలిసిన మగపిల్లలందరూ ఆమెకిలాగా వుంటే ఆయనకి యెంతో బాగుండేది. కాని మగపిల్లలు తేడాగా వుండేవాళ్లు. మగపిల్లలు నాన్నని యేడిపించేవాళ్లు, ఆడపిల్లతో ఆడుకుంటున్నందుకు. నాన్న కనిపించినప్పుడల్లా

మాషా అంటే సాషాకిష్టం
మాషా అంటే సాషాకిష్టం

అని పాడేవాళ్లు.

"యేం పెళ్లెప్పుడు?" అని అడిగేవాళ్లు.

అబ్బాయి అమ్మాయితో ఆడుకోవడం ఘోరం అని వాళ్ల వూహ.

నాన్నకి చాలా బాధ అనిపించేది. ఒకే అప్పుడు ఆయన యేడ్చేవాడు.

కాని చిన్న మాషా వూరికే నవ్వేసేది.

"వాళ్ల యిష్టం వచ్చినట్టు వుడికించుకోనీ!" అనేసేది.

అందుకని ఆమెని వుడికించడంలో అందం కనిపించలేదు. మగపిల్లలు నాన్ననే యేడిపించేవాళ్లు. మాషాని గురించి పట్టించుకునేవాళ్లే కాదు.

ఓ రోజున ఓ పెద్ద కుక్క పెరట్లోకి పరిగెత్తి వచ్చింది.

"అది పిచ్చి కుక్క (రోయ్" అని యెవళ్లో అరిచేరు.

ధైర్యం యెక్కువ వున్న పిల్లలు కూడా బెదిరిపోయేరు. చిన్న నాన్న యెక్కడి వాడక్కడే బిగుసుకుపోయేడు. కుక్క దగ్గరికి వచ్చేస్తోంది. అప్పుడు చిన్న మాషా నాన్న దగ్గరికి పరిగెత్తి వెళ్లింది. తన చేతిలో వున్న చిన్న పారని కుక్కకేసి వూపింది.

"పో యిక్కడ్నుంచి" అని అరిచింది.

ఆ కుక్క తోక ముడుచుకుని పెరట్లోనుంచి పారిపోయింది. అది పరాయి పెరట్లోకి పార పాటున వచ్చింది. తమ పెరడుకీ, పరాయి పెరడుకీ తేడా ప్రతి కుక్కకీ తెలును. మహా ఉగ్రంగా వుండే కుక్క కూడా పరాయి వాళ్ల పెరట్లో తన ఉగ్రత్వం మరిచిపోతుంది.

అది పిచ్చి కుక్క కాదని తెలియగానే మగపిల్లలందరూ కర్రలతో, రాళ్లతో దాని వెనక బడ్డారు. సరే ఆ పని చెయ్యడానికి పెద్ద ధైర్యం అక్కర్లేదు లెండి. ఆ సంగతి కుక్కకీ అర్థమైంది. వీధిలోకి వెళ్లిపోగానే అది వెనక్కి తిరిగి గుర్రుమంది. పిల్లలు మళ్లీ తమ పెరట్లోకి పరిగెత్తి వచ్చేశారు. చిన్న నాన్నని వుడికించడం మొదలుపెట్టేరు.

"పిరికి పిల్లి! బెదిరిపోయేవ్! పరిగెత్తను కూడా పరిగెత్తలేకపోయేవు" అన్నారు.

''నాకే కాదు భయం! మీకూనూ! మాషా వొక్కత్తే భయపడలేదు.''

అప్పుడు మగపిల్లలందరూ సిగ్గు పడిపోయేరు. వాళ్లు మాట్లాడలేకపోయేరు.

''అది నిజం కాదు, నాకూ భయమేసింది'' అని మాషా అంది.

అప్పుడు అందరూ నవ్వేరు. చిన్న నాన్నని తర్వాత యెన్నడూ వుడికించలేదు. నాన్నా, మాషా మంచి స్నేహితులుగా వుండిపోయేరు.

# నాన్న బల పరీక్ష



నాన్న చిన్నప్పుడు ఆయనకి చాలా మంది స్నేహితులు వుండేవాళ్ళు. ప్రతి రోజూ అంతా కలిసి ఆడుకునేవాళ్ళు. అప్పుడప్పుడు పోట్లాడుకుంటునూ వుండేవాళ్ళు. కాని మళ్లీ కలిసిపోయే వాళ్ళు. కాని యెప్పుడూ పోట్లాడని అబ్బాయి వొకడుండేవాడు. అతని పేరు వోవ నజారొవ్. అతను పొట్టిగా, దిట్టంగా వుండేవాడు. అతని తండ్రి ఆశ్విక దళంలో వుండేవాడు. వోవకి వాళ్ల నాన్నగారి దళానికి కమాండర్ అయిన బుదోన్ని గురించి చెప్పుకోవడం గొప్పగా వుండేది. బుదోన్ని

చాలా పేరున్న కమాండర్. బుదోన్ని యెంత ధైర్యవంతుడో, ఆయన శ్వేత రక్షక దళంతో యెలా పోరాడేడో చెప్పడం వోవకి గొప్పగా వుండేది. బుదోన్నికి జనరల్స్ అన్నా, కల్నల్స్ అన్నా, తుపాకీ గుళ్లన్నా కత్తులన్నా యేం భయం వుండేది కాదు. వోవకి బుదోన్ని గుర్రం గురించీ, కత్తి గురించీ కూడా బాగా తెలుసు.

"నేను పెద్దయాక బుదోన్నిలాగా అవుతాను" అని వోవ అంటూ వుండేవాడు.

చిన్న నాన్నకి వోవ యింటికి వెళ్లడం యిష్టం. వాళ్ల యింటి దగ్గర యెప్పుడూ సరదాగా వుండేది. వోవ యెప్పుడూ యేదో వొకటి చేస్తూనే వుండేవాడు. రొట్టె కోసం దుకాణానికి వెళ్లేవాడు, కట్టెలు కొట్టి తెచ్చేవాడు. యిల్లు వూడ్చేవాడు. కంచాలు కడిగేవాడు.

వోవ అంటే యింట్లో అందరికీ యిష్టమే. ఆ విషయం నాన్న చూశేడు. వోవ నాన్న వోవతో పెద్ద వాడితో మాట్లాడినట్టు మాట్లాడేవాడు.

"ఆదివారం నాడు భోజనానికి యెవర్ని పిలుద్దాం రా, వోవ?" అని అడిగేవాడు.

"కట్టెలు వసంతకాలం దాకా సరిపోతాయంటావురా, వోవ?" అని అడిగేవాడు.

వోవకి యేం జవాబు చెప్పాలో తెలుసు.

వోవ స్నేహితులెవళ్లేనా వోవని చూడ్డానికి వెడితే వాళ్లని మర్యాద చేసి కూచో బెట్టి యేదన్నా మంచిది తినడానికి పెట్టేవాళ్లు. తర్వాత అందరూ కలిసి ఆటలు ఆడుకునేవాళ్లు. వోవ యింటి దగ్గర వున్నంత సరదాగా తమ యింటి దగ్గర లేకపోయిందే అని చిన్న నాన్న యెప్పుడూ బాధ పడుతూ వుండేవాడు. ఆయనా వోవా మంచి స్నేహితులు. కాని వోవ యెందుకు యెప్పుడూ పోట్లాడే వాడు కాదో ఆయనకి తెలిసేది కాదు.

"పోట్లాట అంటే నీకు భయమా?" అని నాన్న వోవని అడిగేడు.

"మీ పక్షంతో మీరే పోట్లాడుకుంటే యేమిటి లాభం?" అని వోవ అన్నాడు.

అందర్లోకీ బలమైన వాళ్లు యెవరు అని వో సారి మగపిల్లలందరూ వాదులాడుకున్నారు.

"నాకంటే పెద్ద వాళ్లెవరన్నా నాకు భయం లేదు. మీలో అందర్నీ కుక్క పిల్లల్ని విసిరి నట్టు విసిరేస్తాను. చూడండి నా కండలు" అని వో సారి వో కుర్రాడు అన్నాడు.

"నాకెంత బలం వుందంటే నేనే నమ్మ లేను యింత బలవంతుడినా నేను అని! నా యెడమ చెయ్యి ముఖ్యంగా. ఉక్కుతో చేసినట్టు వుంటుంది యిది" అని యింకో కుర్రాడు అన్నాడు.

"నేనెంత బలవంతుణ్నో చూడాలని మీరు అనుకుంటే నాకు పిచ్చెక్కించాలి మీరు. అప్పుడు అడ్డం తప్పుకు వెళ్లిపోతే మీకు లాభం, యేమంటే యేం చేస్తానో నాకే తెలీదు" అని మరొకడు అన్నాడు.

"వాదవలెందుకర్రా! మీ అందరికంటే యెక్కువ బలవంతుణ్ణి నేను" అని చిన్న నాన్న అన్నాడు.

అందరూ అలా డబ్బా కొట్టుకుంటూనే వున్నారు. వోవ వజారావ్ వొక్క మాట కూడా అనలేదు.

"నాకు తెలుసు లెండి రా! మనం కుస్తీ పడదాం. యెవళ్లు నెగ్గుతారో వాళ్లే అందరికంటే బలం వున్న వాళ్లు" అని వో కుర్రాడు అన్నాడు.

అందరూ సై అంటే సై అన్నారు. కుస్తీ పట్టడం మొదలుపెట్టేరు. ప్రతి వాడికీ వోవతో కుస్తీ పట్టాలని వుంది. అతను యెప్పుడూ పోట్లాడలేదు, అంచేత అందర్లోకీ అతనే బలం లేని వాడని వాళ్లు అనుకున్నారు.

కుస్తీ పట్టడం వోవకి మొదట్లో యిష్టం లేదు. కాని ఉక్కుతో చేసిన యెడం చెయ్యి వుందన్న కుర్రాడు అతన్ని లాగ్గానే వోవకి చిర్రెత్తిపోయింది. కళ్లు మూసి తెరిచే లోపల ఆ కుర్రాణ్ణి నేలమీదకి విసిరేశాడు. తర్వాత అందర్నీ కుక్క పిల్లల్లా విసిరేస్తానని అన్న కుర్రాడు నేలమీద వెల్లకిలా పడిపోయేడు. నాకు పిచ్చెక్కించండి అని సవాల్ చేసినవాడు యిట్టే వోడిపోయేడు. తర్వాత వోవ చిన్న నాన్నని నేలమీదకి బోర్లపడేశాడు. వోవ, నాన్నా మంచి స్నేహితులు కాబట్టి నాన్నని కిందకి పడగొట్టడమే బాగా కష్టమైన పని అన్నట్టు కనిపింపచేశాడు.

"వోవ! నువ్వే రా అందర్లోకీ బలం వున్న వాడివి. కాని యెప్పుడూ ఆ ముక్క అన్లేదేం?" అని పిల్లలు అడిగారు.

వోవ నవ్వేడు.

"గొప్పలు పోతే లాభం యేమిట్రా?" అన్నాడు.

కుర్రాళ్లు యేమీ మాట్లాడలేకపోయేరు. కాని అప్పట్నుంచీ బలం, గిలం అంటూ గొప్పలు తగ్గించేరు. బలంగా నిజంగా వుండాలంటే గొప్పలు పోవడమే కాదని చిన్న నాన్న గ్రహించేడు. నాన్నకి వోవ అంటే ముందటికంటే యిష్టం పెరిగింది.

చాలా యేళ్లు గడిచిపోయేయి. నాన్న పెద్దవాడయేడు. మరో నగరానికి మారిపోయేడు. వోవ యెక్కడున్నదీ తెలియదు. కాని వోవ చక్కటి మనిషి అయివుంటాడన్నది మాత్రం ఖాయం.

# నాన్న బళ్ళో చేరడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి యెప్పుడూ నలతగానే వుండేది. ఆయనకి రాని చిన్న పిల్లల జబ్బు అంటూ లేదు. పొంగు వచ్చింది, గవదలు వాచేయి, కోరింత దగ్గు వచ్చింది. అలా జబ్బు వచ్చిన ప్రతి సారీ తర్వాత చిక్కులు వచ్చేవి. అవి తగ్గేక మళ్లీ యింకో జబ్బు వచ్చేది.

నాన్న బళ్ళో చేరే వయసు వచ్చేటప్పటికి యెప్పటిలాగా జబ్బు చేసింది. మొత్తంమీద నయమై కోలుకున్నాక మొదటి సారి బళ్ళోకి వెళ్లేడు. తీరా చూస్తే అక్కడ వున్న పిల్లలు అప్పటికే చదువుకి అలవాటు పడ్డారు. వాళ్లందరూ వొకళ్లనొకళ్లు బాగా యెరుగుదురు, టీచర్‌కీ వాళ్లు బాగా తెలుసు. కాని నాన్నే అందరికీ కొత్త. అందరూ నాన్నకేసి తేరిపార చూశేరు. నాన్నకి అది

నచ్చలేదు. కొంత మంది పిల్లలు నాలికలు బయటపెట్టి వెక్కిరించేరు. అది మరీ నచ్చలేదు.

ఓ కుర్రాడు కావాల్సికి నాన్నని తొట్రి పడేట్టు చేశాడు. నాన్న పడిపోయేడు. కాని ఆయన యేడవలేదు. లేచి ఆ కుర్రాణ్ణి తోశేడు. అప్పుడు ఆ కుర్రాడు పడ్డాడు. తర్వాత అతను లేచి నాన్నని తోశేడు. అప్పుడు నాన్న పడ్డాడు. కాని యీ సారీ నాన్న యేడవలేదు. ఆ కుర్రాణ్ణి మళ్లీ తోశేడు. యిలా రోజంతా వొకళ్లనొకళ్లు తోసుకుంటూనే వుండేవాళ్లో యేమో సరిగ్గా అప్పుడే గంట మోగింది. పిల్లలు క్లాసులోకి వెళ్లి యెవళ్ల చోటుల్లో వాళ్లు కూచున్నారు. చిన్న నాన్నకి యెక్కడ కూచోవాలో తెలీలేదు. అమ్మాయిల పక్కన కూచోమ్మని నాన్నకి టీచరు చెప్పింది. అందరూ నవ్వేరు. నాన్న యెవళ్ల పక్క కూచున్నాడో ఆ అమ్మాయి కూడా నవ్వింది.

నాన్నకి యేడుపు వచ్చినంత పనైంది. కాని హఠాత్తుగా అంతా సరదాగా కనిపించి ఆయనా నవ్వేడు. టీచరు కూడా నవ్వింది.

"బాగుంది! నువ్వేడుస్తావేమో అనుకున్నా" అందావిడ.

"నేనూ అలానే అనుకున్నా" అన్నాడు చిన్న నాన్న.

అప్పుడు అందరూ మళ్లీ నవ్వేరు.

"చూడండి పిల్లలూ! మీకు చెప్పాలనుకున్నా. మీకెప్పుడేనా యేడుపు వస్తే నవ్వ ప్రయత్నించండి. యిది నేను మీకిచ్చే సలహా. మీ యావజ్జీవితం గుర్తుంచుకోండి. మరింక పాఠం మొదలెడదాం" అందావిడ.

క్లాసులో అందరికంటే తనే బాగా చదవగలనని మొదటి రోజున నాన్నకి అర్థమైంది. తన దస్తూరియే అందరి దస్తూరీల్లోకీ అధ్వాన్నంగా వుంటుంది అన్న విషయమూ ఆయనకి అర్థమైంది. కాని పాఠం జరుగుతూ వున్నంత సేపూ నాన్నే అందరికంటే యెక్కువ మాట్లాడుతూ వుండడం అందరూ గమనించినప్పుడు టీచర్ ఆయనకేసి పాయింట్ చేసింది.

ఆమె చాలా మంచి టీచరు. స్ట్రిక్టుగా వుండేది. కాని దయగా వుండేది. ఆమె పాఠం వినడం బావుండేది. నాన్న ఆవిడ సలహాని జీవితంలో యెన్నడూ మరిచిపోలేదు. అదే కదా బళ్లో మొదటి రోజు. ఆ తర్వాత చాలా రోజులు గడిచేయి. సంతోషంగా వుండే రోజులు, విచారం కలిగించిన రోజులు, మంచి జరిగిన రోజులు, చెడు జరిగిన రోజులు నాన్న బళ్లో చదువుకునే కాలంలో వున్నాయి. కాని అది వేరే కథ.

## నాన్న యెప్పుడూ బడికి ఆలస్యంగా వెళ్లడం



నాన్న చిన్నప్పుడు మిగిలిన పిల్లలందరి లాగానే బళ్లోకి వెడుతూ వుండేవాడు.

మిగిలిన పిల్లలు గంట కొట్టే ముందే బడికి వెళ్లేవాళ్లు. కాని నాన్న మాత్రం యెప్పుడూ ఆలస్యంగా వెళ్లేవాడు. ఒకో సారి రెండవ పీరియడ్‌కి కూడా ఆలస్యం అయేవాడు. టీచర్‌కి యీ సంగతి ఆశ్చర్యం కలిగించింది. నాన్నలాంటి విద్యార్థి అంతకు ముందెన్నడూ ఆమెకి తగల్లేదని

ఆవిడ అంది. నాన్నలాంటి పిల్లాడు బహుశా మరే బళ్ళోనూ లేడేమోనని హెడ్మాస్టరు కూడా అన్నారట.

"యెప్పుడూ ఆలస్యంగానే వస్తున్నాడు. వాళ్ల అమ్మా నాన్నా మేం యేమీ చెయ్యలేం అంటున్నారు. అప్పుడే రెండు సార్లు మాట్లాడేను వాళ్లతో'" అని హెడ్మాస్టరు అన్నాడు.

నిజంగానే నాన్నా వాళ్ల అమ్మా నాన్నా యేమీ చెయ్యలేకపోయేరు. ప్రతి రోజు సాయంత్రమూ అదే గొడవ మళ్లీ మళ్లీ జరుగుతూ వుండేది.

"హోమ్ వర్కు చేశావురా?" అని మామ్మ అడిగేది.

"ఓ క్షణం వుండమ్మా'" అని చిన్న నాన్న చెప్పేవాడు.

"ఆ చదవడం ఆపు చేసి వెంటనే హోమ్ వర్కు చెయ్యి" అని తాతయ్య అనేవాడు.

"యింకొక్క పేజీ అంటే" అనేవాడు నాన్న.

చిన్న నాన్న ఆ పేజీ పూర్తిచేసి మళ్లీ కొత్త పేజీ మొదలుపెట్టేవాడు. సరదాగా వుండే పుస్తకాన్ని కింద పెట్టేసి బోరుకొట్టే పాఠాలు చదవడం నాన్నకి యిష్టంగా వుండేది కాదు.

"ఆ పుస్తకం కింద పెట్టరా."

"అయిపోయింది. యిప్పుడే."

"ఆ పుస్తకం కింద పెట్టరా."

"అయిపోయింది, యిప్పుడే."

ఆఖరికి తాతయ్యకీ, మామ్మకీ వోపిక చచ్చిపోయేది. చిన్న నాన్న చేతిలో వున్న పుస్తకాన్ని లాగేసుకునేవాళ్లు.

"యెందుకూ పనికి రాని చవట పెయ్యమ్మవి అవుతావు" అని తిట్టేవాళ్లు.

అప్పుడు చిన్న నాన్నకి చాలా బాధ కలిగేది. ఆయన యేడిచి మొత్తుకుని పుస్తకం యిమ్మని గోల చేసేవాడు. ఆ పుస్తకం తిరిగి యిస్తే గాని హోమ్ వర్కు మొదలుపెట్టనని మొరాయించేవాడు.

ఆ రకంగా సాయంత్రం గడిచిపోయేది. చిన్న నాన్న ఆఖరికి హోమ్ వర్కు చెయ్యడానికి కూర్చునే వేళకి నిద్ర ముంచుకు వచ్చేది. మామ్మా, తాతా లేపే వాళ్లు, ఆయన మళ్లీ నిద్రపోయేవాడు. కాని మళ్లీ మళ్లీ వాళ్లు లేపుతూనే వుండేవాళ్లు. ఆ రకంగా ఆయన మగతలో హోమ్ వర్కు చేసేవాడు. మొత్తంమీద అది పూర్తయేటప్పటికి ఆలస్యం అయిపోయేది. తాత మామ్మ అలసిపోయేవాళ్లు.

యిక పొద్దుటి పూట వేరే కథ వుండనే వుంది.

"లేరా" అని మామ్మ లేపేది.

"ఓ క్షణం" అనేవాడు నాన్న.

"లేరా" అని అరిచేవాడు తాతయ్య.

"యిప్పుడే" అనేవాడు నాన్న.

"లేరా!"

"వూఁ, యిప్పుడే..."

"ఆలస్యం అయిపోతోందిరా."

"వూఁ, లేచేసా..."

"ఆలస్యం అయిందిప్పటికే..."

"లేస్తున్నా..."

రాత్రి పొద్దుపోయి మంచం యెక్కినప్పుడు పొద్దున్నే లేవడం యెంత కష్టమో ప్రతి వాళ్లకీ తెలుసు. కమ్మని కలలన్నీ పొద్దుటి పూటే వస్తాయి. ముఖ్యంగా బళ్లోకి వెళ్లవలసి వచ్చినప్పుడు.

నాన్న వొళ్లు విరుచుకుని, ఆవలించి, నిద్రమగతగా బట్టలు సర్దుకుని, ముఖం కాళ్లూ చేతులూ కడుక్కుని, మగతగా నాస్తా తిని, పుస్తకాలు పోగు చేసుకునేటప్పటికి పుణ్యకాలం కాస్తా అయిపోతూ వుండేది. అప్పుడు యింట్లోనుంచి బయటపడి దారిలో కనిపించే ప్రతి గడియారం కేసి అమ్మ బాబోయ్ అనుకుంటూ చూస్తూ బడికి పరిగెత్తేవాడు.

నాన్న ఆఖరికి రొప్పుతూ రోజుతూ క్లాసులోకి వెళ్లేటప్పటికి పిల్లలు అరుపులు కేకలతో నవ్వేవాళ్లు, టీచరు కూడా నవ్వేది. "వచ్చాడండీ మన నిద్రాదేవత ముద్దు బిడ్డ" అనేదావిడ. ఆ మాట ముల్లులా గుచ్చుకునేది.

బడి గోడకి తగిలించే రాతపత్రికలో నాన్న బొమ్మని గీశేరు. తాతా, మామ్మా రెండు పెద్ద బాల్చీలతో నీళ్లు కుమ్మరిస్తూ వుంటే నాన్న మంచంమీద కుంభకర్ణుడిలాగా నిద్ర పోతూ వున్న బొమ్మ అది. పెద్ద అలారం గడియారం నాన్నని వో చెవి పట్టుకు గుంజుతూ వుంటుంది, వో కుర్రాడు బాకా వూదుతూ వుంటాడు. ఆ బొమ్మ కింద శీర్షిక "జోలపాట" అని రాశేరు. అది చూసి నాన్నకి కోపం వచ్చింది, అయినా ఆలస్యంగానే వెళ్లేవాడు గాని మారలేదు.

చిన్న నాన్న హోమ్ వర్కు ఆఖరి క్షణంలో చేసేవాడు కాబట్టి యెప్పుడూ సక్రమంగా వుండేది కాదు అది. బడికి ఆలస్యంగా వెళ్లేవాడు కాబట్టి టీచరు చెప్పే కొత్త పాఠం దక్కేది కాదు. మిగిలిన పిల్లలందరూ యేం చేస్తూ వున్నదీ ఆయనకి బోధపడేది కాదు.

అదీగాక ఆయన యెప్పుడు చూసినా ఉరుకులు పరుగులుమీద వున్నట్టూ, ఆలస్యం అవుతున్నట్టూ, ఆవేశ పడిపోతూ వున్నట్టూనే కనిపించేది. యిదేం బాగా లేదని తెలుసు. అయినా ఆలస్యం అవుతూనే వుండేది.

నాన్న ఆలస్యం అవకుండా సరిదిద్దేందుకు వాళ్ల అమ్మా నాన్నా యేం చేశారో చెప్పడం నాకు యిష్టం.

టీచర్లు, యితర పిల్లలు నాన్న బడికి వో రోజు ముందుగా వచ్చేటట్టు యేం చేశారో ఆ తర్వాత నాన్న ఆలస్యంగా యెప్పుడూ వెళ్ల లేదో చెప్పడం నాకు యిష్టం.

కాని అబద్ధం చెప్పడం నాకు యిష్టం లేదు.

చిన్న నాన్న జీవితమంతా అన్ని విషయాల్లోనూ ఆలస్యంగానే వున్నాడు. బడికి ఆలస్యంగా వెళ్లేవాడు, కాలేజీకి ఆలస్యంగా వెళ్లేవాడు, పనికి ఆలస్యంగా వెళ్లేవాడు. అందరూ యెప్పుడూ నాన్నని ఆటపట్టించేవారు. చిన్న నాన్నని దండించేరు, తిట్టేరు, అవమాన పరిచేరు. యీ ఘోర మైన అలవాటువల్ల ఆయనకి జీవితంలో చాలా నష్టాలు జరిగేయి. థియేటర్‌కి ఆలస్యంగా వెళ్లేవాడు. యే ప్రదర్శననీ ఆరంభంనుంచీ చూడలేదు. ఆయన పార్టీలకి యెప్పుడూ యెంతో ఆలస్యంగా వెడుతూ వుండడంతో ఆయన్ని యెవళ్లూ పార్టీలకి పిలిచేవాళ్లు కాదు. వ్యవహారాలకీ ఆలస్యంగానే వెడుతూ మొత్తం అన్నిట్నీ నాశనం చేసి పెట్టేవాడు.

ఆయన కొత్త సంవత్సరానికి వొంటరిగా వొఖ్ఖడూ నిర్జనంగా వున్న వీధిలో స్వాగతం పలికిన సందర్భాలు యెన్నో. యేమంటే తను వెళ్లవలసిన నూతన సంవత్సర పార్టీకి ఆలస్యం అయేవాడు. ఆయన కోసం చాలా మంది నిష్ఫలంగా యెదురు చూశేవారు.

నాన్న ఆలస్యం గురించి ఆయన మిత్రులు చిత్రమైన కథలు చెప్పేవారు. యిప్పటి క్కూడా నిదానంగా నడవడం నాన్నకి చేత కాదు. యెప్పుడూ ఉరుకులే, పరుగులే, యేమంటే ఆలస్యం అయిపోతోంది అవతల. రాత్రిళ్ల నిద్రలో కూడా తను ఆలస్యం అయినట్టే కలగనేవాడు. నిద్రలో మూలిగేవాడు, వొణికేవాడు. ఒకో అప్పుడు తను చిన్న పిల్లాడైనట్టూ, బడికి ఆలస్యం అవుతున్నట్టూ ఆయనకి కల వస్తుంది. కాని కలలో గడియారంకేసి చూసుకుంటే అప్పే ఆల స్యం కాదు, పెందరాళే వెడుతున్నాడు అనిపిస్తుంది. అందరూ ఆయన్ని అభినందించారు. హెడ్మా

స్టరు నాన్నకి పుష్ప గుచ్ఛం యిచ్చాడు. నాన్న బొమ్మని బడి ఆడిటోరియంలో వేలాడగట్టేరు. ఆయన కోసం భజంత్రీలు వాయించేరు. ఆయనకి యెప్పుడూ ఆ సమయంలో మెలుకువ వచ్చేది, తను మళ్లీ చిన్న వాడైతే యెన్నడు బడికి ఆలస్యంగా వెళ్లనని అనుకుంటాడు. అది వొట్టి కోరిక మాత్రమే.

# నాన్న సినిమాకి వెళ్లడం



నాన్న చిన్నప్పుడు ఆయన్ని సినిమాకి వెళ్లనిచ్చేవారు కాదు.

''నువ్వింకా చాలా చిన్న పిల్లాడివి. బోలెడు టైముంది. అయినా నువ్వు చూసేదేమీ లేదక్కడ'' అనేవాళ్లు.

అలా అని తాతా, మామ్మా అనేవాళ్లు.

''నన్నడిగితే సినిమా అంటు రోగాల పుట్ట తప్ప యేం కాదంటాను. పొంగు, ఎర్ర

జ్వరం, కోరింత దగ్గు తప్ప యేమీ లేవక్కడ. డిప్తీరియా సంగతి సరేసరి'' అని నాన్న వాళ్ల అత్త అనేది.

అత్త డిప్తీరియా గురించి ఉపన్యాసం మొదలుపెట్టేది. తనని సినిమాకి వెళ్లనిమ్మని నాన్న యెంత బతిమాలినా లాభం లేకపోయేది. తన మిత్రులంతా యెప్పట్నుంచో సినిమాలకి వెడుతూ వున్నారనీ, వాళ్లల్లో యెవళ్లకీ పొంగు గాని, ఎర్ర జ్వరం గాని, కోరింత దగ్గు గాని రాలేదనీ డిప్తీరియా అసలే లేదనీ నాన్న యెంతలా చెప్పినా వాళ్లు వినేవాళ్లు కాదు. యెప్పుడూ వొకటే జవాబు:

''నువ్వు బళ్లో చేరితే యెలాగూ తప్పదు. నీకు అవి రాకుండా మేం ఆపలేం. నీ యిష్టం వొచ్చినన్ని సార్లు సినిమాలకి వెళ్లు'' అనేవాళ్లు.

విడుదల అయిన కొత్త సినిమాలన్నిట్నీ చిన్న నాన్న చూశేరు ఆయన స్నేహితులు వర్ణించిన దాంట్లో. ''ది మార్క్ ఆఫ్ జీరో''లో డగ్లస్ ఫెయిర్‌బేంక్స్ యెలా గుర్రాన్ని దౌడు తీయించిందీ యెలా కత్తిసాము చేసిందీ, నల్లని ముసుగులో యెలా ప్రత్యక్షం అయిందీ, శత్రువులనందర్నీ హతం చేసిందీ వాళ్లు చూపించేవారు. వాళ్లు చార్లీ చాప్లిన్‌నీ, కామెడియన్ ఇగోర్ ఇల్‌యిన్‌స్కీనీ, సన్నగా పొడుగ్గా వుండే పాట్‌నీ, చిన్నగా స్థూలంగా వుండే పాటస్ఖాన్‌నీ అనుకరించి చూపించేవాళ్లు. వాళ్లు తమకి చేతనైనంత బాగా అనుకరించి చూపించే వాళ్లు. ప్రసిద్ధుడైన కౌబాయ్ విల్లియమ్ హార్ట్‌ని అనుకరిస్తూ వొకళ్ల వెనక వొకళ్లు దౌడు తీస్తూ వెళ్లేవాళ్లు.

అప్పుడు పెద్ద వాళ్ల మాటల్లో మేరీ పిక్‌ఫర్డ్ చిరునవ్వు మనోహరమైందని నాన్న విన్నాడు.

''ఆమె చిరునవ్వు యెలా వుంటుంది?'' అని నాన్న తన నేస్తాల్ని అడిగేడు. అచ్చు మేరీ పిక్‌ఫర్డ్ యెలా చిరునవ్వు నవ్వుతుందో అలానే చేసి చూపించేడు వో కుర్రాడు. అతను చాలా కష్టపడి ప్రయత్నించేడు. అతను మేరీ పిక్‌ఫర్డ్ కంటే బాగా చిరునవ్వు నవ్వేడని మిగిలిన పిల్లలందరూ అన్నారు. మరి ఆమె నవ్విందంటే ఆమె యెన్నో యేళ్లుగా అలా చిరునవ్వు నవ్వుతూనే వుంది, పైగా అందుకామెకి డబ్బొ యిస్తారు. యీ కుర్రాడైతే వూరికే రెండో సారి చిరునవ్వు నవ్వుతున్నాడు. అది కూడా వూరికే స్నేహితుడి కోసం.

ఆ పిల్లలు తన కుతూహలం తీర్చడానికి ప్రయత్నిస్తున్నట్టు నాన్నకి తెలుసు. కాని సినిమాకి

వెళ్ళాలన్న కోరిక దానివల్ల యెక్కువ అయింది.

ఆ శుభఘడియ రానే వచ్చింది. నాన్న బళ్లో చేరేడు. ఆ ఆదివారం రోజునే టీచర్ క్లాసు పిల్లలందర్నీ "లిటిల్ రెడ్ డెవిల్స్" అనే మాటినీ షోకి తీసుకు వెళ్లింది. నాన్న ఆ పుస్తకం చదివేడు. కుర్ర స్కౌట్లనీ, భయంకరమైన దుర్మార్గుడినీ అద్భుత ఉత్తేజకర సాహసకృత్యాలనీ తెర మీద చూడాలని అనుకున్నాడు.

సినిమా హాలు నాన్న వాళ్ల యింటికి బాగా దగ్గర. పీత్య బాబయ్యకి కూడా తెలుసు అది యెక్కడ వుందో. అందుకని ఆయన ఆలస్యంగా వుండే నాన్న కంటే ముందే అక్కడికి చేరుకున్నాడు. నాన్న క్లాస్‌మేట్స్‌తో కత్తు కలిపేడు. టీచర్‌కి కూడా బాబయ్య అంటే యిష్టం కుదిరింది. చిన్న నాన్న తమ్ముణ్ణి అక్కడ చూసి యేమీ మాటా పలుకూ అనలేదు. ఆయన చెవి పుచ్చుకుని బరబర యీడ్చుకుంటూ పోయేడు. చిన్న పీత్య బాబయ్య అమ్మోయ్ అని అరుపు లంకించుకోవడంతో ఆయన నోట్లో వున్న తీపి బిళ్లలు కింద పడిపోయేయి. నాన్న క్లాసులో వున్న ఆడపిల్లలు ఆయనకి వాటిని పెట్టేరు, పీత్య బాబయ్య చాలా మర్యాదా మన్నన తెలిసిన వాడు. యెవళ్లన్నా తనకి బిళ్లలు పెట్టినప్పుడు వద్దు అని అనేవాడు కాదు.

చిన్న పీత్య బాబయ్య చాలా గట్టిగా యేడిచాడు. నాన్న క్లాస్‌మేట్లందరూ బాబయ్య పక్షం వహించేరు. "రానీ ఆ అబ్బాయిని కూడా, నే చూసుకుంటా అతని సంగతి" అంది టీచరు.

దాంతో నాన్న బాబయ్య చెవి వదిలేశాడు.

అందరూ లోపలికి వెళ్లారు. పిల్లలు అన్ని వేపులనుంచీ గుమ్మాల గుండా పరిగెత్తేరు. చిన్న పీత్య బాబయ్య సంతోషంగా వున్నాడు, కుందేలు పిల్లలాగా అందరికంటే ముందు గెంతుకుంటూ వెళ్లేడు. అలా గెంతడంలో తొట్రిల్లి కింద పడ్డాడు. నాన్న సరిగ్గా బాబయ్య వెనకాలే వెడుతున్నాడు. తమ్ముడిమీద నాన్న కూడా తొట్రిల్లి పడిపోయేడు. వెనక్కాల పరిగెత్తి వస్తూ వున్న క్లాసు పిల్లలందరూ వొకళ్లమీద వొకళ్లు పడిపోయేరు. కింద వున్న వాళ్లకి బరువు యెక్కువైపోయింది. కుందేలు పిల్లలా పరుగు పెడుతూ వున్న పీత్య బాబయ్య కుందేలు పిల్లలా అరుపు లంకించుకున్నాడు. నాన్నా అరిచేడు. అప్పుడు నాన్న క్లాసు టీచరూ మరో యిద్దరు టీచర్లూ అయ్యో అయ్యో అంటూ పరిగెత్తుకుంటూ వచ్చేరు. వాళ్లు పిల్లలందర్నీ ఆపి నాన్నని పీత్య బాబయ్యని యెత్తేరు. యిద్దరికీ బాగా దెబ్బలు తగిలేయి. అందు

కని వాళ్లని యింటికి పంపేశారు. వాళ్లని చూసి అత్తయ్య తన మాట నెగ్గిందన్న సంతోషంతో "చూశారా? నే చెప్పానా?" అంది.

ఆ తర్వాత చాలా కాలం దాకా చిన్న నాన్నని సినిమాకి వెళ్ల నివ్వలేదు. మొత్తానికి "లిటిల్ రెడ్ డెవిల్స్"ని చూడనిచ్చేరు లెండి అలాగే చాలా సినిమాలకీ వెళ్లనిచ్చేరు. నాన్నకి యిప్పటికీ సినిమాలంటే యిష్టం. పిత్య బాబయ్యకీనీ.

# నాన్నని ఆడపిల్లలు యేడిపించడం



నాన్న చిన్నప్పుడు మొదట బళ్ళోకి వెళ్లినప్పుడు జరిగిన సంగతి యిది. గంట మోగేది, యింటర్వల్ అయిపోయేది. వరండాల్లో యెవళ్ళూ వుండేవాళ్ళు కాదు. పిల్లలందరూ క్లాసులో కూర్చునేవాళ్ళు. కాని నాన్న మాత్రం గుమ్మం దగ్గర నుంచుండిపోయి గట్టిగా యేడుస్తూ వుండేవాడు. క్లాసంతా నవ్వుతూ, యికిలిస్తూ వుండేది. టీచరు వచ్చేక యేం జరిగిందో చూసేది.

"యేమిటి సంగతి? యేం, ఆడపిల్లలు నిన్ను యేడిపిస్తున్నారా?" అని చిన్నగా నవ్వుతూ అడిగేది.

అవునన్నట్టు నాన్న తల వూపేవాడు.

ఆడపిల్లలు నాన్నని యెందుకు యేడిపించేవాళ్లు? యెలా యేడిపించేవాళ్లు? యింతా చేసి యేమీ వుండేది కాదు. అందరూ యింటర్వెల్‌కి బయటికి వెళ్లేటప్పుడు ముగ్గురు నలుగురు అమ్మాయిలు నాన్న కూర్చున్న చోటికి వెళ్లి ఆయనకేసి చూస్తూ గట్టిగా నవ్వేవాళ్లు. నాన్న చాలా బెరుకు మనిషి, తన మానాన తను వుండేవాడు. ఆయనకి తెలిసిన ఆడపిల్ల వొక్క మాషా మాత్రమే. మామూలుగా ఆయన ఆడపిల్లలకి దూరంగా వుండేవాడు. అమ్మాయిలు యీ సంగతి కనిపెట్టారు. ఆయన్ని వుడికించడం మొదలుపెట్టారు. అలా మొదలైంది గొడవ.

అసలు మనం వొక అమ్మాయి పక్కన కూర్చోవాల్సి వస్తే అంత బాధలేదు. కాని మన బల్ల దగ్గర నలుగురమ్మాయిలు కూర్చుని మనల్ని చూసి పిల్లి కూతలు నక్క కూతలు కూస్తూ వుంటే యెలా వుంటుందంటారు? అదే సమస్యంతానూ, వాళ్లతో కలిసి మొత్తం క్లాసు క్లాసంతా అదేలా వుంటేనో? యిక అంతే సంగతులు. దాంతో చిన్న నాన్న క్లాసులోనుంచి బయటికి పరిగెత్తి వెళ్లిపోయేవాడు. తలుపు వెనక్కాల నుంచునేవాడు, భోరుభోరున యేడిచేవాడు. ఆయన్ని చూస్తే తమాషాగా వుండేది.

"అసలు వాళ్ల గురించి యెందుకు పట్టించుకుంటావు? నీ బల్ల దగ్గరనుంచి వాళ్లని తరిమెయ్యి. గెంటెయ్యి! గట్టిగా, బుద్ధి వచ్చేటట్టు గెంటెయ్యి" అని మిగిలిన అబ్బాయిలు అనేవాళ్లు.

గట్టిగా నవ్వి, యెక్కువ ఉడికించిన అమ్మాయిని వాళ్ల గెంటేసేవాళ్లు. ఆ అమ్మాయి ముచ్చటైంది, చాలా కలుపు గోలుగా వుంటుంది. ఆమె పేరు తమారా. లేకపోతే గాల్యా అనుకుంటాను. యేమో వేరా అయివుండచ్చు, లూసీ అయివుండచ్చు. కాదు, కాదు వాల్యా. నాన్నకి మిగిలిన పిల్లలందరికంటే తనంటేనే యెక్కువ యిష్టం అని ఆమెకి బహుశా తెలుసు. ఆడపిల్లలకి అలాంటి విషయాలు యెప్పుడూ బాగా అర్థం అవుతాయి. అందుకనే బహుశా ఆమె అంత బిగ్గరగా నవ్వింది. కాని చిన్న నాన్నకి అది యేడుపు తెప్పించింది.

ఆఖరికి టీచర్‌కి విసుగొచ్చింది యీ గొడవ చూసి. వో రోజున ఆమె నాన్నని చేత్తో పట్టుకుని క్లాసులోకి వచ్చింది.

"యీ క్లాసులో పదహారుగురు అమ్మాయిలు, పద్దెనిమిది మంది అబ్బాయిలు వున్నారు. పదహారుగురు అమ్మాయిలు వొక్క పిల్లవాణ్ణి పట్టుకుని యేడిపించడమే! మిగిలిన పదిహేడు మందిని వాళ్ల యెందుకు యేడిపించరు? యేం చెప్పరేం యెవళ్లూ చెప్తారు జవాబు?" అందావిడ.

అందరూ నవ్వేరు.

''యెందుకు వాళ్లు వొక్క అబ్బాయినే పట్టుకుని యేడిపించడం? వూఁ? నేను సీరియస్‌గా అడుగుతున్నాను, చెప్పండి'' అందావిడ.

యెవళ్ళూ మాట్లాడలేదు. కొంతమంది అమ్మాయిలు యికిలించేరు. ఓ అబ్బాయి నేను చెప్తానన్నట్టు చెయ్యి యెత్తి చూపించి నుంచున్నాడు.

''యెందుకంటే అతను యేడుస్తాడు కాబట్టి.''

''అదీ సంగతి! గుర్తుంచుకో! యేడవడంకంటే నవ్వడం మంచిదని మనం అనుకున్నాం. యేం తెలిసిందా?'' అందావిడ, నాన్నకేసి చూసి.

''వూఁ'' అని నాన్న యెగబీల్చేడు.

''అయితే గుర్తు వుంచుకో. మరిచిపోయేవో అమ్మాయిలు నీ జీవితమంతా నిన్ను యేడిపిస్తూనే వుంటారు'' అని చెప్పింది టీచరు.

అంత ఘోరమైన పని జరగడం చిన్న నాన్నకి యిష్టం లేదు. తర్వాత సారి అమ్మాయిలు తన బల్ల దగ్గర కూర్చుని, తనకేసి చూసి నవ్వినప్పుడు ఆయన యేడవలేదు. మాటా పలుకూ లేకుండా ఆ వరస దగ్గరికి నడిచి వెళ్లి తనకి యిష్టంగా వుండే అమ్మాయి పక్కన కూర్చునే వాడు. అప్పుడు అందరూ ఆమెని చూసి నవ్వేవారు. ఆమె యేడ్చేది కాదు నవ్వేదీ కాదు. ఆ తర్వాత అమ్మాయిలు నాన్నని యేడిపించలేదు. నాన్నకి స్నేహితులు అయేరు కూడా. తర్వాత అబ్బాయిలే నాన్నని యేడిపించేరు. కాని అబ్బాయిలు అబ్బాయిలే కదా, వాళ్లు అందర్నీ యేడిపిస్తూనే వుంటారు.

# నాన్న పులి వేట



నాన్న చిన్న పిల్లాడిగా వుండి బడికి వెళ్లినప్పుడు ఆయన పులి వేటకి వెళ్లేడు. ఆ పులి కూడా చిన్నదే. అది చదువుకోవడానికి బడికి వెళ్లకపోయినా బడి పెరట్లోనే వుండేది. అదంతా యిలా జరిగింది.

వసంతరుతువులో ఓ రోజున మధ్యాహ్నం పూట బడి అయిపోయేక నాన్న, ఆయన నేస్తాలు పెరట్లో యెండలో కూచున్నారు. మగపిల్లలు అన్ని చోట్లా మాట్లాడుకుంటూ వున్నట్టే

అన్ని విషయాల గురించీ వొక సారే మాట్లాడుకుంటూ వున్నారు. వాళ్ళ ఫుట్‌బాల్ గురించి, ఆ మర్నాడు జరిగే పోటీ గురించీ, అంతకు ముందు రోజు జరిగిన దాన్ని గురించీ, "బాగ్దాద్ దొంగ" సినిమా గురించీ, తమకిష్టం అయిన ఐస్ క్రీమ్ రుచుల గురించీ, యెవళ్ళ కేంప్‌కి వెడతారో దాన్ని గురించీ, పల్లెటూళ్ళో తల్లితండ్రులతో విసుగ్గా వేసవి కాలం గడపడం గురించీ మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాట్లాడుకుంటూ వుంటే చిన్న నాన్న పుస్తకం చదువు కుంటున్నాడు. ఆ పుస్తకం యేమిటో నాకు తెలీదు, కాని బహుశా సాహస కృత్యాల పుస్తకం అయివుండవచ్చు. దాంతో, అందరూ మాట్లాడ్డం ఆపేక నాన్న వున్నట్టుండి అన్నాడు.

"అబ్బ, పులి వేటకి వెడితే బాగుంటుంది" అని.

అందరూ నవ్వేరు.

"నన్ను కూడా తీసుకెళ్ళరోయ్" అన్నాడు మీష.

"నన్ను! నన్ను కూడా!" అని పిల్లలందరూ అరిచేరు.

"ఒరేయ్ అందరం కలిసి వెడదాం, క్లాసంతా" అని అప్పుడు వొక అబ్బాయి అరిచాడు.

ఆ ముక్క అందరికీ నచ్చింది.

"కాని వాటిని వేటాడ్డం యెలారా?" అని మీష అడిగేడు.

"చాలా తేలిక. మొదట యేనుగుల్ని అడివిలోకి స్వారీ చేసుకువెళ్ళండి. అడివి నిండా కోతులు, అరటి పళ్ళు, చిలకలు వుంటాయి" అని నాన్న అన్నాడు.

"నీటి బాతులు రంగుల రుమాళ్ళు, గిలకలు వుంటాయి" అని మీష సాగదీసుకున్నాడు. "మాకు పులి గురించి చెప్పరా" అన్నాడు.

"నే చెప్పబోయేది అదే కదా మరి. పులి అడివిలో దాంకుంటుంది. అప్పుడు అది యెగిరి గెంతి యేనుగుమీదకి వురుకుతుంది. అప్పుడు అందరం తుపాకీ కాలుస్తాం. వో యేనుగు పులిని తొండంతో మెలి తిప్పి పట్టుకుంటుంది, నేలకేసి కొట్టి కసాపిసా తొక్కేస్తుంది. చూడండి. అంతా యిదుగో యిక్కడ బొమ్మలో వుంది.

పిల్లలు బొమ్మకేసి చూశేరు. చాలా సేపు తదేకంగా చూశేరు.

"నాకు తెలిసింది! నువ్వు, నువ్వు, నువ్వు యేనుగులు. నేను, నువ్వు, నువ్వు వేట గాళ్ళం. యీ పెరడు అడివి. ప్రతి వేటగాడికీ తుపాకీలాగా వో కర్ర వుంటుంది. యేం తయారుగా

వున్నారా? వూఁ, యేనుగులు యెక్కండి, పదండి! అదుగో పులి! చూశారా చారలు?'' అని మీష అన్నాడు.

''అది పిల్లి పిల్లరా!'' అన్నాడు నాన్న.

''ఛవ్! వోర్మొయ్యి రా! యేం అంటున్నావో నీకు తెలీటం లేదు. యిప్పుడు నే చెప్పేది వినండిరా! యేనుగులూ పదండి!''

చిన్న నాన్న వేటగాడు. యేనుగుమీద కూర్చుని చూశేడు. ఆ చిన్న చారల పిల్లి ఆశ్చర్యంతో యీ యేనుగులకేసీ వేటగాళ్లకేసీ చూసింది. దానికి యెంత ఆశ్చర్యం కలిగిందంటే అసలు పారి పోవాలని కూడా అనుకోలేదది.

''కాల్చండి'' అని మీష అరిచేడు.

కఱ్ఱలు, రాళ్లు పాపం ఆ పిల్లి పిల్లమీదకి విరుచుకుపడ్డాయి. నాన్న తనకి తెలియకుండానే దానిమీదకి వో కఱ్ఱ విసిరేడు. కాని అది గురి తప్పింది. ఆ పిల్లి పిల్ల భయపడి పరుగు లంకించు కుంది. సరిగ్గా ఆ సమయంలో వో రాయి దాని తలకి తగిలింది. అది మ్యావ్, మ్యావ్‌మని అరుస్తూ పడిపోయింది. దాని కాళ్లు కంపించేయి. అంతే.

''మనం పులిని చంపేం'' అని మీష అరిచాడు.

''పిల్లి చచ్చిపోయింది రా'' అని అప్పుడు యెవళ్లో అన్నారు.

దాన్ని చూద్దామని అందరూ పరిగెత్తి వెళ్లేరు.

ఆ చిన్ని బొచ్చు చారల బంతికి చలనం లేదు. పిల్లి అప్పటిదాకా బతికే వుందని అప్పుడు చచ్చిపోయిందని నాన్నకి తట్టింది. అది యింక పరిగెత్తలేదు, గెంతలేదు, మిగిలిన పిల్లి పిల్లలతో ఆడుకోలేదు. అది పెద్ద పిల్లి అవలేదు. చుంచుల్ని పట్టుకోలేదు, కప్పమీద యెక్కి మ్యావ్‌మని అరవలేదు. పాపం దాని కథ ముగిసిపోయింది. అసలు అది పులి వేట ఆట ఆడాలని అనుకోనే లేదేమో. కాని దాన్ని యెవళ్లూ అడగందే. కుఱ్ఱాళ్లు మాట్లాడకుండా చచ్చిపోయిన పిల్లి దగ్గర నుంచు న్నారు.

మీష కూడా యేం మాట్లాడలేదు.

అప్పుడు యెవళ్లో అరవడం వినిపించింది.

''అయ్యో! అయ్యో! నా పిల్లి పిల్ల! నా పిల్లి పిల్ల!'' ఆమె చిన్న పిల్ల. తలకి పెద్ద నీలం రిబ్బను చుట్టుకుంది. దాన్ని యెత్తి యింటికి తీసుకుపోయింది. అబ్బాయిలందరూ

యిళ్లకి వెళ్లిపోయేరు. వాళ్లు చచ్చేటంత సిగ్గు పడిపోయి వొకళ్లకేసి వొకళ్లు చూసుకోలేదు.

అప్పట్నుంచీ నాన్న వో పిల్లిని గాని, కుక్కని గాని, మరే జంతువుని గాని తన జీవితంలో గాయపర్చలేదు. యిప్పటికీ ఆ చారల పిల్లిని తలుచుకుంటే ఆయనకి బాధగానే వుంటుంది.

# నాన్న బొమ్మలు గియ్యడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి బొమ్మలు గియ్యడం యిష్టంగా వుండేది. రంగు పెన్సిళ్ల పెట్టె దొరికితే రోజంతా గీస్తూనే వుండేవాడు. చిన్న యిళ్ల బొమ్మలు గీశేవాడు. ప్రతి యింటికీ వో పొగగొట్టం వుండేది. ఆ పొగగొట్టంలోనుంచి పొగ చిమ్ముకుంటూ వచ్చేది. ప్రతి యింటి దగ్గరా వో చెట్టు వుండేది. ప్రతి చెట్టుమీద వో పక్షి వుండేది. యిళ్ళన్నీ ఎరుపు రంగులో వుండేవి. యిళ్ల కప్పులన్నీ పసుప్పచ్చగానే వుండేవి. పొగ గొట్టాలన్నీ వల్లగానే వుండేవి. వాటిల్లోనుంచి

వచ్చే పొగ లేత నీలం రంగు, యెరుపు పొగ. చెట్లు నీలంవి. పకులు ఆకుపచ్చగా వుండేవి. యెరుపు జీర వున్న నీల ఆకాశంలో బంగారు సూర్యుడు ప్రకాశించేవాడు. సూర్యుడికి పక్కనే వెండి చంద్రుడు వుండేవాడు. చంద్రుడి చుట్టూతా వెండి బంగారు రంగుల నక్షత్రాలు వుండేవి. ఆ బొమ్మ చక్కగా ముచ్చటగా వుండేది. కాని ఆ బొమ్మ చూసిన వాళ్లందరూ

''నీలం చెట్లూ, ఆకుపచ్చ పిట్టలూ యెక్కడ కనిపించాయి నీకు?'' అని అడిగేవాళ్లు.

''యీ బొమ్మలోనే'' అని నాన్న అనేవాడు.

నాన్న బళ్లో చేరక ముందే తను యెంత బాగా గీసేదీ తనకి తెలుసునని ఆయన అనుకునే వాడు. కాని బళ్లో అందరూ యింకోలా అనుకునేవారు. ఆయన యెంత పాడుగా గీసేవాడంటే డ్రాయింగ్ టీచర్ యెప్పుడూ వొక్క మాట అన్లేదు. ''బాగుంది'' అనో, ''బాగా లేదు'' అనో, ''యీ గీత వంకర తప్పించు'' అనో మిగిలిన పిల్లలతో అనేవాడు గాని, నాన్నని చూసి ''బాగా లేదు'' అని కూడా అనేవాడు కాదు. నాన్న కూచున్న చోటనుంచి అలా పక్కనే వెడుతూ నాన్న గీసే బొమ్మని చూసి డ్రాయింగ్ టీచర్ ముఖం అంతా ముడతలు పడిపోయేది పులుపు నిమ్మకాయ తిన్నట్టు.

కొంతమంది అమ్మాయిలు నాన్నని చూసి జాలిపడేవారు. టీచర్ ముఖం చాటు చెయ్యగానే వాళ్లు గబగబ నాన్న డ్రాయింగ్ పుస్తకంలో యేదో గీశేసేవాళ్లు. యెంత చెత్తగా వుండాలో అంత చెత్తగా గీశేవాళ్లు. కాని నాన్న గీసినంత చెత్తగా యెవళ్లూ గియ్యలేరు. టీచర్కి తేడా వెంటనే తెలిసిపోయేది.

''యెవరు గీశేరు?'' అని నాన్నని అడిగేవాడు.

''నేను గియ్యలేదు'' అని నాన్న నిజం చెప్పేవాడు.

''ఆ సంగతి నాకూ తెలుసులే'' అనేవాడు టీచరు. ''కాని నీకు సాయం చేసిన వాళ్లెవరా? అని. యిలా అయితే నీకు డ్రాయింగు యెన్నటికీ రాదు. నీ అంతట నువ్వే యేదో గియ్యాలి'' అనేవాడు టీచర్.

''నేను నా అంతట గీస్తున్నాను యిప్పుడు'' అని నాన్న అని తనే యేదో గీయడం మొదలు పెట్టేవాడు. టీచర్ మళ్లీ చిట్లించుకునేవాడు.

''యిప్పుడిది నీ బొమ్మ అని వేరే చెప్పక్కర్లేదు.''

తర్వాత తల్లితండ్రుల సమావేశం జరిగినప్పుడు డ్రాయింగ్ టీచర్ చిన్న ఉపన్యాసం చేశాడు.

''మా విద్యార్థుల తల్లిదండ్రులకి నమస్కారం! యీ క్లాసులో డ్రాయింగ్‌లో అయిదు మందికి ఎక్సెలెంట్ మార్కులు వచ్చాయి'' అని ఆయన వాళ్ల పేర్లు చెప్పేడు.

''చాలా మంది పిల్లలకి మంచి మార్కులు వచ్చేయి. అంత బాగా గియ్యలేని వాళ్ళూ చాలా మంది వున్నారు.''

అంటూ ఆయన మరిన్ని పేర్లు చెప్పేడు.

''కాని వో కుర్రాడున్నాడు'' అని నాన్న పేరు చెపుతూ ఆయన ముఖం వికారంగా పెట్టేడు. ''అతను బాగా గియ్యడం లేదని కాదు కాని యేదో లోపం వుంది. డ్రాయింగు నేర్చు కోకుండా అతన్ని ఆటంక పరిచేది యేదో వుంది'' అన్నాడు.

మామ్మ, తాత చాలా జావగారి పోయేరు. కాని నిజం అంతే కదా. తర్వాత నాన్న బడి చదువు పూర్తయింది. నాన్న టెక్నికల్ స్కూల్ కూడా పూర్తి చేశాడు, కాలేజీ డిగ్రీ పుచ్చుకున్నాడు. అంత కాలంలోనూ ఆయన పిల్లి బొమ్మని గియ్యడం మాత్రం నేర్చుకున్నాడు. అయితే పిల్లి బొమ్మ గియ్యడం ప్రతి పిల్ల వాడికీ తెలుసు. పిల్లి బొమ్మలు గియ్యడం చిన్న పిల్లలకి కూడా తెలుసు. నాన్నకి వాళ్లని చూస్తే అసూయగా వుండేది. యేమంటే ఆయన గీసిన బొమ్మల కంటే వాళ్లు గీసినవే బాగుండేవి. వో సారి ఆయన తనంత చెత్తగానూ గీసే ఆర్టిస్టుని కలుసుకు న్నాడు. కాని ఆ మనిషి ''నాకీ ముఖం యిలా కనిపిస్తుంది, ఆ చెట్టు, ఆ గుర్రం నాకలా కనిపిస్తాయి అలా గీస్తాను'' అన్నాడు.

డ్రాయింగ్ టీచర్‌కి నాన్న అలా యెప్పుడూ చెప్పలేకపోయేడు, పాపం!



# నాన్న టీచర్‌కి మస్కా కొట్టడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి టీచర్ అంటే చాలా యిష్టంగా వుండేది. ఆమె అంటే పిల్లలందరికీ యిష్టంగానే వుండేది. ఆమె గడకర్రలా పొడుగ్గా వుండేది. చూడ్డానికి యేం బాగుండేది కాదు. పైగా యెప్పుడూ నల్లని బట్టలే వేసుకునేది. ఆమె యేం బాగోదని పెద్ద వాళ్లు అంటూ వుండేవాళ్లు. కాని ఆమె చాలా అందమైనదని చిన్న నాన్నకి అనిపించేది. ఆవిడ పేరు అఫనాసియా నికీఫొరొవ్నా. ఆమె చాలా సరదాగా వుండేది, కాని చాలా స్ట్రిక్టుగా కూడా వుండేది.

అన్నిటికంటే చెప్పుకోవాల్సింది ఆమె చాలా నిష్పక్షపాతంగా వుండేది. ఆవిడకి గనక తమమీద కోపం వస్తే ఆ తప్పు తమదే అని పిల్లలందరికీ తెలుసు. తగినంత కారణం లేకుండా ఆవిడ యెప్పుడూ కోప్పడేది కాదు. ఆవిడకి క్లాసులో ప్రత్యేక అభిమాన పాత్రులు యెవళ్ళూ లేరు. ఆవిడకి అందరి పిల్లల పట్లా అభిమానం వుండేది. యెవళ్ళు హోమ్‌వర్కు చెయ్యకపోయినా ఆవిడ కోప్పడేది, యెవళ్ళు క్లాసులో అల్లరి చేసినా కోప్పడేది. ఆవిడ యిరవై యేళ్ళుగా టీచింగ్ చేస్తూ వుందని ప్రతి వాళ్ళకీ తెలుసు. ఆవిడకి బడాయి కోరులన్నా, దొంగ పనులు చేసేవాళ్ళన్నా, ఆకతాయి పిల్లలన్నా అసహ్యం అనీ ప్రతి వాళ్ళకీ తెలుసు.

అఫనాసియా నికీఫొరొవ్నా పాఠాలు యెప్పుడూ భలే ఆసక్తికరంగా వుంటాయి. అందుకని ఆవిడ క్లాసులో పిల్లలు బుద్ధిగా వుండేవాళ్ళు. ఓ రోజున యెవళ్ళో నాన్న వీపుమీద వో గుండు సూదిని గుచ్చేరు. నాన్నకి బాగా నొప్పి పెట్టింది.

''చచ్చాన్రా!'' అని నాన్న అరిచేడు.

''యేమైంది?'' అని టీచర్ అడిగింది.

చిన్న నాన్న యేమీ అనలేదు.

''బయటికి వెళ్ళిపో'' అందావిడ.

చిన్న నాన్న లేచి గుమ్మం వేపు నడిచేడు. అప్పుడు యిద్దరు అమ్మాయిలు అరిచేరు:

''జైచికోవ్ అతన్ని గుండుసూదితో గుచ్చేడు'' అని చెప్పేరు.

''అరిచిన వాడు, గుచ్చిన వాడు, యిలా చెప్పిన వాళ్ళు క్లాసులోనుంచి వెళ్ళిపోవాలి. యేమంటారు పిల్లలూ?'' అంది ఆవిడ.

''అవును'' అని పిల్లలందరూ అరిచేరు.

దాంతో ఆ యిద్దరు అమ్మాయిలు, నాన్న, జైచికోవ్ బయటికి వెళ్ళిపోయేరు.

చిన్న నాన్న యేడిచేడు. ఆయనకి చాలా బాధగా వుంది. గుండుసూది గుచ్చుకుని నొప్పి పుట్టిందీ తనకే, క్లాసులోనుంచి బయటికి తరిమి వేసిందీ తననే. జైచికోవ్ అమ్మాయిల్ని చూసీ, నాన్నని చూసీ నవ్వేడు. కాని పైకి నటిస్తూ వున్నంత సంతోషంగా అతను లేడని తెలుస్తూనే వుంది. అమ్మాయిలు యేడవనూ లేదు, సంతోషించనూ లేదు. వాళ్ళ మనసులు నొచ్చుకున్నాయి.

మర్నాడు చిన్న నాన్న బడికి పెద్ద మేకు తీసుకువెళ్ళేడు. టీచర్ బ్లాక్ బోర్డుమీద రాయ డానికి తిరగ్గానే చిన్న నాన్న మేకుని జైచికోవ్ చేతిలో గుచ్చేడు. జైచికోవ్ పెంకు లెగిరిపోయేట్టు

అరిచేడు. నాన్న ఆ అరుపు చూసి బెదిరిపోయేడు. అఫనాసియా నికీఫొరొవ్నాకి చాలా కోపం వచ్చింది.

''యెవరది? జైచికోవ్?''

''నేను కాదు, నన్ను వీడు గుచ్చేడు'' అని యేడుస్తూ ఆవిడకి చెయ్యి చాచి చూపిస్తూ చెప్పేడు జైచికోవ్.

''నిన్న నువ్వు యెవళ్లనో గుచ్చేవు, యివాళ నిన్ను వేరే వాళ్లు గుచ్చేరు. బాగుంది, యేం? జైచికోవ్‌ని యెవరు గుచ్చేరు?''

పిల్లలందరూ నాన్నకేసి తిరిగి చూసేరు కాని యెవళ్లూ యేమీ చెప్పలేదు. దొంగ పని చెయ్యడం యెవళ్లకీ యిష్టం లేదు. జైచికోవ్ కూడా యేమీ అన్లేదు. అతను యెగబీల్చి వెక్కడంతే.

''వూఁ, చెప్పరేం? యెవరు గుచ్చిన వాళ్లు?'' అని ఆవిడ కటువుగా అడిగింది. నాన్నకి భయం వేసేసింది.

''నేను గుచ్చలేదు'' అని హఠాత్తుగా అన్నాడు.

''దేంతో గుచ్చలేదు?'' అని టీచర్ అడిగింది.

''యీ మేకుతో'' అన్నాడు నాన్న.

క్లాసు క్లాసంతా నవ్వేరు. యెంత గట్టిగా నవ్వేరంటే పక్క గదిలోనుంచి టీచర్ వచ్చేడు.

''అఫనాసియా నికీఫొరొవ్నా యేమిటి మీ వాళ్లంతా మాంచి హుషారుగా వున్నారు?'' అని అడిగేడు.

''మేం హుషారుగా వున్నాం, యేమంటే వో కుర్రాడు యింకో కుర్రాణ్ణి యీ మేకుతో గుచ్చలేదు, ఆ కుర్రాడు యేడవలేదు, యెవళ్లూ అరవలేదు. యెవళ్లూ తమ టీచరికి మస్కా కొట్టలేదు'' అని ఆవిడ చెప్పింది.

దాంతో పిల్లలందరూ బాగా సిగ్గు పడిపోయేరు. అందరూ నాన్నకేసి కోపంగా చూసేరు. నాన్న లేచి నుంచున్నాడు.

''నిన్న వాడు నన్ను గుచ్చేడు, నేను అరిచేను. యివాళ నేను గుచ్చేను, వాడు అరిచేడు. నేను అబద్ధం ఆడేను'' అని చెప్పేడు.

''యిక పైనుంచి నేను అబద్ధం ఆడను, అఫనాసియా నికీఫొరొవ్నా'' అని నాన్న కొంచెం ఆగి, చెప్పేడు.

''నేనూనూ'' అని జైచికోవ్ చెప్పేడు. కాని అతను నాన్నకేసి పిడికిలి వూపేడు, యెవరూ అతని మాటలు నమ్మలేదు.

''అబద్ధం ఆడ్డంకంటే పాడు పని యింకోటి లేదు'' అని టీచరు అంది.

నాన్న ఆ తర్వాత యెన్నడూ అబద్ధం చెప్పలేదు ఆవిడకి.

దాదాపు యెప్పుడూ అబద్ధం ఆడనూ లేదు.

# నాన్న ట్రామ్‌ని ఆపడం



నాన్న చిన్నప్పుడు ఆయన క్లాసులో చదువుకునే మీష అనే స్నేహితుడు వుండేవాడు.

మీష భలే కొంటె కోణంగి. ఇంటర్వెల్‌లో అతని చుట్టూ యెప్పుడూ గుంపు పోగయేది. మీష పిల్లి కూతలు కూసేవాడు, కుక్కలా భౌభౌ మనేవాడు. తేనెటీగలా 'జుం'మ్మనేవాడు. పంది లాగా గుర్రుగుర్రు మనేవాడు. అందరూ అతను చేసే యీ చేష్టలు చూడాలి అనే వుండేవాళ్లు. అతను కోడిలాగా బాగా కొక్కొక్కొ అని అరిచేవాడు. నిజంగా చూడాల్సిందే. మొదటగా చిన్న

కోడిపుంజులాగా అనుకరించి అరిచేవాడు. తర్వాత ''కొక్కొ...'' బాగా వచ్చేది. ''రోకో'' సరిగా వచ్చేది కాదు. కాని చిన్న కోడిపుంజు కంచెమీదకి యెగురుతుందిగా, తన బతుకులో మొదటి సారిగా గొప్పగా కూస్తుందిగా రెక్కల్ని గొప్పగా కొట్టుకుంటుందిగా. అక్కడికి వచ్చేటప్పటికి మీష లాగులో టక్ చేసుకున్న చొక్కాని పైకి లాక్కుని పొట్టమీద చేతులతో బాదుకునేవాడు. అచ్చం కోడి రెక్కలు ఆడించినట్టే వుండేది. కాని ఇంటర్వల్ యెంత సేపు వున్నా మీష ప్రతిభా విశేషాల ప్రదర్శనకి టైమ్ సరిపోయేది కాదు. దాంతో పాఠం మధ్యలో పిల్లి మ్యావ్ అనేది, పంది పిల్ల గుర్‌మనేది.

''మీష! ఆ మ్యావ్‌లూ, గుర్‌లూ ఆపు'' అని టీచర్ హెచ్చరించేది. ''ఆ కూతలు నాకు సరిపడవు. మీషా! వినిపిస్తోందా? భౌభౌ మనడం ఆపు. యెంత సేపు గుర్ మంటావు? నువ్వేనా కిచకిచ లాడుతూ వుంట? మరో సారి కుయ్యి బయటికి పంపేస్తాను'' అనేది.

కాని మీషని యెప్పుడూ బయటికి పంపేవాళ్లు కాదు. టీచర్‌కి అతనంటే యిష్టమే. అతని కోణంగి చేష్టలు చూసి నవ్వుకునేది. హెడ్మాస్టరుక్కూడా గట్టిగా నవ్వొచ్చేసేది, అందరూ చూస్తూ వుండగానే. ఓ సారి ఆయన మీషని తన గదికి పిలిచేడు. కొంటె పనులు తప్పంటూ ఉపన్యాసం దంచేడు.

''వూఁ, వెళ్లు! మళ్లీ యీ గదిలో యిలా కంప్లయింట్లమీద నువ్వు కాలు పెట్టకూడదు'' అని ముగించేడు.

మీష చేతులు నేలమీద ఆన్చి పిల్లి మొగ్గ వేసుకుంటూ హెడ్మాస్టరు గదిలోనుంచి బయటికి వెళ్లేడు. తర్వాత అతని తల్లిదండ్రుల్ని పిలిపించేరనుకోండి. కాని హెడ్మాస్టరు కూడా నవ్వేడని అందరూ చూశేరు.

ఓ రోజున క్లాసు అయిపోయేక పిల్లలు వెడుతూ వున్నారు. ''ఒరేయ్, నేను ట్రామ్‌ని ఆపేస్తారా. చూస్తారా?'' అని మీష అన్నాడు.

అంతకంటేనా? అందరికీ సరదాయే కదా.

''అలాగే'' అని అరిచారు.

''పదండి'' అన్నాడు మీష.

పిల్లలందరూ అతని వెనకాలే వెళ్లారు. ట్రామ్ లైన్ బడికి దగ్గర్లోనే వుంది.

''మీరంతా యిక్కడ నుంచుని చూస్తూ వుండండి'' అన్నాడు మీష.

ట్రామ్ వస్తోంది. దూరంలో కనిపించింది. మీష ట్రామ్ పట్టాలమీద బోర్లా పడుకుని

చేతులతో తల కప్పేసుకున్నాడు. ట్రామ్ గబగబ వచ్చేస్తోంది. పట్టాలమీద కుర్రాణ్ణి చూసి కండక్టర్ గట్టిగా గంట మోగించేడు.

మీష కదల్లేదు. ట్రామ్ యింకా యింకా దగ్గరకంటూ వచ్చేస్తోంది. గంట యింకా యింకా గీమంటూ మోగుతోంది. కుర్రాళ్లు నుంచున్న చోట బిగుసుకు పోయేరు. ట్రామ్ బాగా దగ్గర కంటూ వచ్చి ఆగిపోయింది. గంట ఆగిపోయింది. వెంటనే మీష యెగిరి గెంతి పక్క సందులోకి పారిపోయేడు. కండక్టర్ యేం చెయ్యగలడు? పిడికిలి బిగబట్టి అతనికేసి బెదిరిస్తూ వూపేడంతే. ట్రామ్ వెళ్లిపోయింది. కుర్రాళ్లంతా మీషని చుట్టు ముట్టేరు.

"నీకు భయం వెయ్యలేదురా?" అని అడిగేరు.

"యిందులో భయ పడాల్సిందేముంది?"

"ట్రామ్ ఆగలేదనుకో, అప్పుడు?"

"వాణ్ణి జైల్లో తోస్తారు."

"వాడు నిన్ను పట్టుకుంటే?"

"వాడు ట్రామ్ వదలడానికి లేదు."

మీష అంతా ముందే ఆలోచించేడన్న మాట.

ఆ మర్నాడు కోల్య స్తెపానొవ్ ట్రామ్‌ని ఆపేడు. మూడో నాడు కోస్త్య ఫెదోతొవ్ ఆపేడు. తర్వాత సికోర్‌స్కీ సోదరులు ఆపేరు. ఆ తర్వాత యెవళ్లో యీ వేడుక చూసేందుకు అమ్మా యిల్నీ కూడా రమ్మని పిలిచేరు. అప్పుడు నాన్న వంతు. నాన్న తప్ప మిగతా అందరి వంతూ అయి పోయింది. ఆడపిల్లలందరికీ యీ విషయం తెలుసు. నాన్న కూడా వాళ్లల్లాగే చెయ్యాలి కదా. నాన్న ట్రామ్‌ని ఆపడానికి పట్టాలమీద పడుకుంటాడు అని తెలియగానే యితర క్లాసుల ఆడ పిల్లలు కూడా చూడ్డానికి వచ్చేరు. యేం చెప్పినా చెందినా నాన్న నెమ్మదైన పిల్లాడు. అంచేత యెలా నాన్న యీ ఘన కార్యం చేద్దామనుకున్నాడో చూద్దామని వాళ్లు వచ్చేరు.

గుంపు చాలా పెద్దది కావడంతో కండక్టరు దూరంనుంచే చూశేడు. నాన్న గట్టిగా కళ్లు మూసేసుకుని, చెవులమీద చేతులు పెట్టేసుకుని పట్టాలమీద పడుకున్నాడు. కండక్టరు చడీచప్పుడూ లేకుండా ట్రామ్‌ని ఆపి, కిందికి వురికి నాన్నకేసి పరిగెత్తేడు.

ట్రామ్ ఆగలేదనీ తనమీదనుంచి వెళ్లిపోయిందనీ నాన్నకి అనిపించింది. తనని కుదుపుతూ అరుస్తూ వున్నది కండక్టర్ అని నాన్న గమనించలేదు.

"హేయ్! దొరికావ్ ఆఖరికి!"

పిల్లలందరూ భయపడి కకావికలై పోయేరు.

"అలా చేసే హక్కు లేదు మీకు" అని మీష మాత్రం పక్క సందులోనుంచి అరిచేడు.

కాని యెవళ్ళూ అతని మాటలు వినిపించుకోలేదు.

చిన్న నాన్నని పోలీసు స్టేషన్‌కి తీసికెళ్లేరు. నాన్న అడ్రస్ రాసుకుని తాతని, మామ్మని, హెడ్మాస్టరుని పోలీసు స్టేషన్‌కి పిలిపించేరు. చిన్న నాన్నకి యింటి దగ్గర దెబ్బలు పడ్డాయి, బళ్లో తలవంపులయేయి. నాన్న గురించి బడి పత్రికలో రాశారు. పట్టాలమీద పడుకుని రోజా ట్రామ్‌ని ఆపిన వాడు నాన్నే అని తాత, మామ్మ, హెడ్మాస్టరు అనుకున్నారు. మీష గొర్బునోవ్, కోల్య స్తెపానొవ్, కోస్త్య ఫెదోతొవ్, సికోర్‌స్కీ అన్నదమ్ములు అందరూ ట్రామ్‌ని ఆపేరని నాన్న చెప్పాలని చెడ్డ బాధపడ్డాడు. కాని చెప్పలేదు.

వాళ్ళ ఆ అవమానం మాననివ్వలేదు. యింకా పాడుగా వున్న విషయం యేమంటే అబ్బాయిలు, అమ్మాయిలు నాన్నని ఆట పట్టించడం. యేమంటే నాన్న వొక్కడేగా దొరికిపోయింది!

"యెలా చెయ్యాలో తెలీకపోతే నోర్మూసుకు కూచోవాలి గాని తగుదునమ్మా అని వేలెట్టకూడదు" అని నాన్న నేస్తం మీష కూడా అన్నాడు.

ఆ తర్వాత యెవళ్ళూ ట్రామ్ లైన్‌మీద పడుకోలేదు. తనని పట్టుకోవడం మెరుగిచ్చింది, ట్రామ్ తర్వాత యెవళ్లమీద నుంచీ పోలేదు అని నాన్నకి సంతోషం కలిగింది. అది నిజంగా అద్భుతమే.

# నాన్న పాముని చంపడం



నాన్న చిన్నప్పుడు ఆయన వో పాముని చంపేడు. అది యిలా జరిగింది.

"పిల్లలూ! రేపు మనం అడివిలోకి వెడుతున్నాం. చక్కని పసిరిక గరికమీద షికారు వెడదాం, మీరు యెండలో ఆడుకోవచ్చు. యెవళ్లు వస్తారు?" అని వో రోజు బడి అయి పోయేక టీచర్ అంది.

పిల్లలందరూ వస్తామని చేతులెత్తేరు. నాన్న కూడా అలావే చేశాడు.

''యెవరికి యిష్టం లేదు?'' అని టీచర్ చిన్నగా నవ్వుతూ అంది.

అప్పుడు పిల్లలందరూ మళ్లీ చేతులు యెత్తేరు. నాన్నా యేత్తేడు.

టీచర్‌కి ఆశ్చర్యం కలిగింది.

''యేమిటి దీని అర్థం? అడివిలోకి షికారు వస్తారా రారా?'' అని అడిగింది.

''వస్తాం'' అని పిల్లలు అరిచేరు.

''అయితే రామని యెందుకు చేతులు యెత్తేరు?''

యెవళ్లూ చెప్పలేకపోయేరు. అప్పుడు ఆఖరికి వొక అమ్మాయి చెప్పింది:

''అందరం వోటు చేద్దామని.''

అప్పుడు అందరూ నవ్వేరు. టీచర్ కూడా నవ్వింది.

''మీరంతా అమాయకం పిల్లలు. సరే, రేపు భోజనాలు తెచ్చుకోవడం మరిచిపోకండి. అడివిలో యేమీ అమ్మరు. యిక వెళ్లిపొండి'' అంది టీచరు.

పిల్లలందరూ లేచి నుంచున్నారు.

వున్నట్టుండి నాన్న మళ్లీ చెయ్యి యెత్తేడు.

''వూఁ, యేమిటి? నీకు నిజంగా వోటు చెయ్యాలని వుంది, కదా?'' అంది టీచరు.

''నేను పార తీసుకు రావచ్చా?''

''మీకందరికీ వోటు అంటే సరదాగా వుంది కాబట్టి యీ విషయంమీద వోటు చేద్దాం. యితను పార తేవచ్చన్న వాళ్లు 'యస్' అని వోటు చెయ్యండి'' అంది టీచరు.

అందరూ చేతులెత్తేరు.

''అందరూ వోటు చేసారు'' అంది టీచర్.

అంచేత నాన్న అడివిలోకి పార తీసుకు వెళ్లేడు. నాన్న అప్పటికింకా చాలా చిన్న పిల్లాడు కదా. ఆయనకి పారంటే యిష్టం. అందరూ వోటు చేసినందుకు ఆయనకి సంతోషం కలిగింది.

అడివిలో యెంతో బాగుంది. చెట్లు ఆకుపచ్చగా వున్నాయి. మొలిచే మొలిచే గడ్డి యెంతో బాగుంది. నాన్న దానికేసే గుడ్లప్పగించి చూశేడు.

''పిల్లలూ, యీ చెట్టు చూడండి. యీ చెట్టేమిటో చెప్పగలరా?'' అని టీచర్ అడిగింది.

"ఓక్ చెట్టు! ఓక్ చెట్టు!" అని అందరూ అరిచేరు.

ఓటు చెయ్యడానికి కుతూహలం చూపించిన అమ్మాయి (ఆమె పేరు ఓల్యా) "యిది బ్రహ్మాండమైన పాత ఓక్ చెట్టు" అంది. ఆమె యెందుకు ఆ ముక్క చెప్పిందో యెవళ్లకీ అర్థం కాలేదు. టీచర్‌కి కూడా ఆశ్చర్యం కలిగింది.

"యిది యేం చెట్టు?" అని ఆమె అడిగింది.

"బర్చ్ చెట్టు" అని అందరూ అరిచేరు.

ఓల్యా మాట్లాడబోవడం చూసి చిన్న నాన్న మెల్లిగా "యిది బ్రహ్మాండమైన పడుచు బర్చ్ చెట్టు" అన్నాడు.

ఓల్యాకి కష్టం కలిగి నాన్నకేసి నాలిక చాపి వెక్కిరించింది.

"బ్రహ్మాండమైన పడుచు నాలిక" అన్నాడు నాన్న.

అందరూ నవ్వేరు.

"యిలా పాఠం మధ్యలో అడ్డం వస్తే వాళ్లని అడివిలోనుంచి వెళ్లిపొమ్మనాల్సి వస్తుంది" అంది టీచర్.

ఆమె ఆ మాటలు కటువుగా అంది. దాంతో అందరూ మెదలకుండా వుండిపోయేరు. కాని తర్వాత ఆమె నవ్వేసింది.

తర్వాత ఆమె వేరు వేరు రకాల చెట్ల గురించి, ఉత్తర ప్రాంతంలో పెరిగే చెట్ల గురించీ, దక్షిణ ప్రాంతంలో పెరిగే చెట్ల గురించీ పిల్లలకి చెప్పింది.

అప్పుడు యెవళ్లకో అల్లిబిల్లి పురుగు కనిపించింది.

"అల్లిబిల్లి పురుగు, అల్లిబిల్లి పురుగూ
యిల్లు వదిలి యెగిరిపో,
కాలిపోతోంది!"

అని పిల్లలు పాడేరు.

కాని అల్లిబిల్లి పురుగు యెగిరిపోలేదు. అప్పుడు పిల్లలకి భోజనాలు గుర్తువచ్చి ఆకలి వేసింది. అడివిలో ఖాళీగా వున్న జాగాలో పిక్నిక్‌కి వెళ్లడం భలే సరదాగా వుంది. పెద్ద చెట్టు బోదెని టేబిల్‌లాగా వాడుకున్నారు. వాళ్లు కొంకళ్లు తాము తెచ్చుకున్న వాటిని

పంచుకున్నారు. టీచర్ తన బేగ్‌లోనుంచి బిళ్లల డబ్బా తియ్యగానే అందరూ కేరింతాలు కొట్టేరు.

వున్నట్టుండి యెవళ్లో అరిచేరు:

"పాము! పాము!"

ఓల్యా అరిచింది. ఆమె ఖాళీ జాగా చివర నాన్న పక్కన కూర్చుంది. ఆమె గబుక్కున యెగిరి గెంతేసి

"అమ్మోయ్! పాము! అమ్మోయ్! పాము!" అని అరిచింది.

చిన్న నాన్న కూడా యెగిరి గెంతేడు. ఓల్యా దగ్గర పాము వొకటి పాకుతూ వుండడం నాన్నకి కనిపించింది. నాన్న పాముని చూడ్డం అదే మొదటి సారి. ఆయన యెంతో భయపడిపోయి బలం కొద్దీ దాన్ని కొట్టేడు. వాడిగా వుండే పారతో దాన్ని కొట్టేడు. ఆ దెబ్బకి పాము రెండు ముక్కలైపోయింది. యే ముక్కకా ముక్క పాకిపోవడం మొదలుపెట్టింది. ఓల్యా అరుస్తూనే వుంది. దాంతో అమ్మాయిలందరూ అరవడం మొదలుపెట్టేరు. కాని టీచర్ మామూలుగానే వుంది. చిన్న నాన్నని ఆమె సరదాగా చూస్తూ వుంది. నాన్న తన సాహస కృత్యంలో వున్నాడు. మొదటగా రెండు ముక్కలైన దాన్ని నాలుగు చేశాడు. ఆ నాలుగింటినీ యెనిమిది చేశాడు. వాటిని పదహారూ, యింకా చెప్తే మూప్పై రెండూ చేసి వుండేవాడే. కాని టీచర్ వచ్చి ఆయన చేతిని గట్టిగా పట్టుకుంది.

"చాల్లే! యిది బురదగొడ్డు! విషం వున్న పాము కాదు! మంచివి యివి" అంది.

నాన్న పాముని ఖండించడం ఆపేడు. అమ్మాయిలు అరవడం మానేశారు. కాని ఓల్యా మానలేదు.

"యిది బురద పాము! బురద పాము!" అని అరవడం మొదలెట్టింది.

ఆ పాటికి మగపిల్లలందరూ అరుపు లంకించుకున్నారు.

"అయ్యో! పాము! అమ్మ బాబోయ్ పాము! పాము(రోయ్!" అని అరవడం మొదలుపెట్టేరు.

"ఛష్! వూరుకోండి" అని టీచర్ గద్దించింది. సద్దు మణిగేక ఆమె మెల్లిగా అంది: "యీ పాములు (ప్రమాదం కాదు. మంచివి. వాటిని చంపకూడదు. యేది (ప్రమాదకరమైందో, యేది కాదో మీరు తెలుసుకోవాలి. యింకోటి గుర్తుపెట్టుకోండి. మీరు అలా విషయం యేమిటైందీ తెలియకుండా అరుపులూ కేకలూ వెయ్యకూడదు. యెవళ్లేనా కు(రాడు అరవకుండా నుంచుని

తన ఫ్రెండ్‌ని కాపాడినప్పుడు నవ్వకూడదు నిజంగా పాముని వంద ముక్కలు చేసే అవసరం లేకపోయినా.''

అప్పుడు అమ్మాయిలు, అబ్బాయిలు అందరూ నవ్వేరు. చిన్న నాన్న పారని పొదల్లోకి విసిరేశాడు. తర్వాత చాలా కాలం దాకా అందరూ ఆయన్ని చూసి బళ్లో ''అమ్మ బాబోయ్! బురద పాము! రక్షించండి'' అని అరిచేవారు; వాళ్ల ఓల్యాని యేడిపించి వుండాల్సింది అని ఆయనకి అనిపించినా. ఆయన మొదటి సారీ, చివరి సారీ పాముని చంపడం అదే.

# నాన్న జర్మన్ భాషమీద కసి తీర్చుకోవడం



నాన్న చిన్నప్పుడు ఆయనకి అన్ని రకాల మార్కులూ వచ్చేవి. రష్యన్‌లో "గుడ్", లెక్కల్లో "ఫెయిర్", చూచిరాతలో "పూర్", డ్రాయింగ్‌లో "వెరీ పూర్" మార్కులు వచ్చేవి. బాగా నేర్చుకోకపోతే మళ్లీ "వెరీ పూర్" అనే రిమార్కు చేస్తానని డ్రాయింగ్ టీచర్ వార్నింగ్ యిచ్చేడు.

ఓ రోజున వో కొత్త టీచరు క్లాసుకి వచ్చింది. ఆమె చాలా బాగుంది. ఆమె చిన్నావిడ, ముచ్చటగా వుంది, నవ్వుతూ వుంది. మంచి డ్రెస్ వేసుకుంది.

''నా పేరు యెలేనా సెర్గేయెవ్నా. మీ పేర్లేమిటి?'' అని అడిగి ఆవిడ నవ్వింది.

''జేన్యా!''

''జీనా!''

''లీజా!''

''మీష!''

''కోల్య!'' అంటూ అందరూ అరిచేరు.

యెలేనా సెర్గేయెవ్నా చెవులమీద చేతులు పెట్టుకుంది. అప్పుడందరూ అరవడం మానేశారు.

''నేను మీకు జర్మన్ భాష చెప్తాను. మీకిష్టమేనా?'' అందావిడ.

''ఓ యిష్టమే, యిష్టమే'' అని క్లాసంతా అరిచేరు.

ఆ రకంగా చిన్న నాన్న జర్మన్ భాష నేర్చుకోవడం మొదలుపెట్టేడు. జర్మన్‌లో కుర్చీకి డెర్ స్టూల్ అనీ, టేబిల్‌కి డెర్ టిష్ అనీ, పుస్తకానికి దాస్ బుహ్ అనీ, పిల్లవాడికి డెర్ క్నాబె అనీ, అమ్మాయికి దాస్ మేడ్‌హెన్ అనీ తెలుసుకోవడం నాన్నకి సరదాగానే వుంది మొదట.

అదో ఆటలాగా వుంది, పిల్లలందరికీ సరదా అనిపించింది. కాని క్రియా రూపనిష్పత్తి, విభక్తి వచ్చేటప్పటికి యీ క్నాబెలు, మేడ్‌హెన్‌లు విసుగు అనిపించడం మొదలుపెట్టాయి. జర్మన్ భాష రావాలీ అంటే చదువు కోవాలి అని గుర్తించేరు. అది ఆట కాదు. అది కూడా లెక్కల్లాగా, రష్యన్‌లాగా పాఠ్యాంశం. యేక కాలంలోనే జర్మన్‌లో రాయడం, జర్మన్‌లో చదవడం, జర్మన్‌లో మాట్లాడ్డం అనే మూడు విషయాలు నేర్చుకోవాలి. పాఠాలు బాగా సరదాగా వుండేటట్టు చెయ్యాలని యెలేనా సెర్గేయెవ్నా తన శాయ శక్తులా ప్రయత్నించింది. క్లాసుకి సరదాగా వుండే కథల పుస్తకాలు తెచ్చేది. పిల్లలకి ఆవిడ జర్మన్ పాటల్ని నేర్పేది. జోకులు చెప్పేది. నిజంగా చదువుకునే పిల్లలకి బోలెడు సరదా. కాని యిష్టంలేని వాళ్లకి హోంవర్కు చెయ్యని వాళ్లకి యే అర్థం లేదు. వాళ్లకి విసుగ్గా వుండేది. వాళ్లు అసలు దాస్ బుహ్‌ని చూసేవాళ్లు కాదు, డెర్ టిష్‌లాగా మొద్దులా వుండి పోయేవాళ్లు యెలేనా సెర్గేయెవ్నా అడిగినప్పుడు.

ఒకో అప్పుడు జర్మన్ పాఠం మొదలయే ముందు ''ఈహ్ హాబె స్పాజియెరన్!'' అనే అరుపు వినిపించేది. అంటే ''నాకు నడక వుంది'' అని. కాని అసలు అర్థం ''పదండి పోదాం యిక్కడి నుంచి'' అని. ఆ అరుపు మొదట వినిపించగానే చాలా మంది పిల్లలు వంత పలికేవారు. పాపం యెలేనా సెర్గేయెవ్నా వచ్చి పిల్లలందరూ ''స్పాజియెరన్'' అనే క్రియా పదాన్ని చదువుతున్నారని

అనుకునేది. తీరా చూస్తే అమ్మాయిలు మాత్రం మిగిలేవారు. యిది ఆమెకి కష్టం కలిగించేది. నాన్న కూడా స్పాజియెరన్ పిల్లాళ్లల్లో వొకడైపోయేవాడు.

యెలేనా సెర్గేయెవ్నాకి కష్టం కలిగించాలని ఆయన వెళ్లిపోయే వాడు కాదు. ఆటలాడుకోవడం, హెడ్మాస్టరు కళ్లబడకుండా దాంకోవడం, మిగిలిన మాస్టర్లకీ, యెలేనా సెర్గేయెవ్నాకి కనిపించకుండా దాంకోవడం సరదాగా వుండేది. క్లాసులో కూర్చోవడం కంటే పాఠం చదవకుండా వుండడం కంటే యెక్కువ సరదాగా వుండే సంగతి యిది. యెలేనా సెర్గేయెవ్నా "హాబెన్ జి డెర్ ఫెదెర్‌మెస్సెర్?" అని అడిగినప్పుడు, (అంటే "మీ దగ్గర పెన్‌నైఫ్ వుందా?") చచ్చి చెడి చాయంగల విన్నపాలై "ఈహ్ నీహ్ట్..." (నన్ను లేదు...) అని తెలివి తక్కువగా చెప్పడం కంటే పారిపోవడం సరదాగా వుండేది. ఆ జవాబు చూసి క్లాసంతా నవ్వేది. తర్వాత బడిలో పిల్లలందరూ నవ్వేవాళ్లు. తనని చూసి నవ్వేవాళ్లంటే చిన్న నాన్నకి యిష్టం వుండేది కాదు. తను మరెవ్వళ్లని చూసైనా నవ్వితే తనకి బాగుంటుందని ఆయనకి అనిపించేది. తనకి తెలివితేటలు వుంటే పాఠాలు సరిగానే చదివేవాడు. జర్మన్ నేర్చుకుంటే యెవళ్లూ నవ్వరు. కాని నాన్నకి టీచర్‌మీద కోపం వచ్చేసేది. జర్మన్ భాషమీద కోపం వచ్చేది. దాన్ని నేర్చుకోకుండా దానిమీద కసి తీర్చుకున్నాడు. నాన్న యెన్నడూ చదవాల్సినట్టుగా జర్మన్ భాషని చదవలేదు. మరో బళ్లో సరిగా ఫ్రెంచి భాషనీ చదవలేదు. కాలేజీలో ఇంగ్లీషునీ చదవలేదు. యిప్పుడు నాన్నకి వొక్క విదేశీ భాష రాదు. అంటే యెవరిమీద కసి తీర్చుకున్నట్టు? తనమీదనే కసి తీర్చుకున్నట్టు ఆయన యిప్పుడు నాలిక కరుచుకుంటారు. తనకిష్టమైన పుస్తకాల్ని అసలు ఆ భాషల్లో ఆయన చదవలేదు. ఆయనకి విదేశాలని చూడాలని వుండేది కాని యే భాషా రాక సిగ్గయేది. నాన్న చాలా సార్లు విదేశాలనుంచి వచ్చిన వాళ్లని కలుసుకుంటూ వుంటాడు. వాళ్లకి రష్యన్ అంత బాగా రాదు. కాని అందరూ రష్యన్ భాష చదువుకుంటున్నారు.

వాళ్లు నాన్నని "ష్ప్రెహెన్ జీ దెయ్చ్?" అనీ, "డు యు స్పీక్ ఇంగ్లీష్?" అనీ, "పార్లే వు ఫ్రాంసే?" అనీ, మీకు జర్మన్ (ఇంగ్లీషు, ఫ్రెంచి) వచ్చా అనీ అడుగుతూ వుంటారు. నాన్న లేదన్నట్టు తల వూపుతాడు అంతే. ఆయన అనగలిగినదల్లా "ఈహ్ నీహ్ట్..." ఆయనకి యెంతో సిగ్గుగా వుండేది.

# నాన్న రెండు కాంపోజిషన్లు రాయడం





నాన్న చిన్నప్పుడు ఆయనకి వాస్య సెరేదిన్ అని స్నేహితుడు వుండేవాడు. నాన్న వాళ్ల యింటికి పక్కనే వుండేవాడు  అతను. యిద్దరూ కలిసే బళ్లోకి వెళ్లేవాళ్లు, యింటికి తిరిగి వచ్చేవాళ్లు, యిద్దరూ వొకే బెంచీమీద కూర్చునేవాళ్లు. వాస్య లెక్కలు అందరికంటే చురుగ్గా చేసేవాడు. నాన్నకి సాయం చేసేవాడు. నాన్న వాస్యకి పద్యాలు కంఠతా వచ్చేటట్టు చెప్పేవాడు. కాంపోజిషన్లు రాయడంలో సాయం చేసేవాడు. ఆ రకంగా యిద్దరూ వొకళ్లంటే వొకళ్లు యిష్టంగా వుండేవాళ్లు, పోట్లాడుకుంటే యిద్దరే పోట్లాడుకునేవాళ్లు.

ఓ రోజున టీచర్ మర్నాటికి ''నేను వేసవి యెలా గడిపాను'' అనే విషయంమీద కాంపోజిషన్ రాయమని హోమ్ వర్కు యిచ్చింది.

''యేం రాయాలో తెలీటం లేదు'' అని వాస్య నాన్నతో అన్నాడు.

''వేసవికాలం యెక్కడ గడిపేవు?'' అని నాన్న అడిగేడు.

''పల్లెలో'' అని వాస్య చెప్పేడు.

''అయితే పల్లె గురించి రాయి.''

''యేం రాయను?''

''యేం చేశావ్ అక్కడ?''

''యేం చేస్తాం ఘనకార్యం! యీతాలు కొట్టేం, చేపలు పట్టేం, అడివిలో తిరిగేం.''

''అదే రాయి'' అని చెప్పేడు చిన్న నాన్న.

వాస్య కాంపోజిషన్ యిట్టే తయారైంది. దాన్ని అతను నాన్నకి చూపించేడు.

నేను వేసవికాలం సెలవలు యెలా గడిపాను

నేను వేసవికాలం సెలవల్ని పల్లెలో అమ్మమ్మతో గడిపాను. యీతాలు కొట్టేను, చేపలు పట్టేను, స్నేహితులతో కలిసి అడివిలో తిరిగేను. వేసవికాలంలో పల్లెలో చాలా బాగుంది.

వి. సెరేదిన్,

అని వుంది.

''యిదేం కాంపోజిషన్రా'' అన్నాడు నాన్న, ''మీ అమ్మమ్మ గురించి రాయి. ఆవిడ యెలా వుంటుందో యేమిటో రాయి. ఆమె యేం అందో, యేం పాటలు పాడిందో రాయి'' అన్నాడు.

''ఆవిడ పాడలేదు. కథలు చెప్పింది'' అన్నాడు వాస్య.

''అయితే ఆ కథల గురించే రాయి. పిల్లల గురించి రాయి, నది గురించి రాయి, అడివి గురించి రాయి.''

''నాకు చేత కాదురా అదంతా రాయడం. నే చెప్తా నువ్వు రాయకూడదూ?'' అన్నాడు వాస్య.

వాస్య నాన్నకి అమ్మమ్మ గురించి, పిల్లల గురించి, నది గురించి, అడివి గురించి యావత్తూ చెప్పేడు. నాన్న పెద్ద కాంపోజిషన్ రాశేడు. చాలా కష్ట పడ్డాడు. కాంపోజిషన్ నిజంగా బాగా వచ్చింది. వాస్యకి తృప్తి కలిగింది.

“నేను దీన్ని కాపీ చేసుకుంటాను. యీ లోపున నీ కాంపోజిషన్ నువ్వు రాసుకో, ఆలస్యం అయిపోతోంది” అన్నాడు వాస్య.

వాస్య వెళ్లిపోయేక నాన్న తన కాంపోజిషన్ రాయడం మొదలుపెట్టేడు. ఆయనకి చాలా కష్టం అనిపించింది. వొకే విషయంమీద రెండు సార్లు రాయడం యిబ్బందే. నాన్న కూడా తన వేసవి సెలవలకి పల్లెటూళ్లో వున్నాడు. నాన్నా అడవుల్లో తిరిగేడు, నదిలో యీతాలు కొట్టేడు. కాని దానంతటి గురించి వాస్య కాంపోజిషన్లో రాసేశాడు. యిప్పుడు తన కాంపోజిషన్ వాస్య కాంపోజిషన్‌లా వుండకూడదనే నాన్నకి అనిపించింది. అలా వుంటే టీచర్ పట్టేస్తుంది. తన కాంపోజిషన్ బాగా వుంటుందా వుండదా అనే దాన్ని గురించి నాన్న పట్టించుకోలేదు. వాస్య కాంపోజిషన్‌కీ తన కాంపోజిషన్ పోలికే లేనట్టు రాశాడు. నిజానికి, టీచరు చెప్పినట్టు, అది కాంపోజిషన్ కాదు, యేమీ కాదు.

టీచరు కాంపోజిషన్ పుస్తకాలు తిరిగి యిచ్చేటప్పుడు అంది:

“యివిగో, మీ కాంపోజిషన్లు. వాస్య సెరేదిన్ కాంపోజిషన్ ఫస్టు. చదివి వినిపిస్తా.”

ఆమె వాస్య కోసం నాన్న రాసిన కాంపోజిషన్ చదివి వినిపించింది.

“బాగుంది వాస్య! చాలా బాగా రాశేవు. చక్కగా వుంది. తప్పుల్లేవు. నీకు మంచి అమ్మమ్మ, భేషైన స్నేహితులు వున్నారు” అంది.

అప్పుడు ఆవిడ యే కారణమూ లేకుండానే నాన్నకేసి చూసింది. వాస్య సెరేదిన్ ముఖం జేవురించుకున్నాడు. తను చెయ్యని పనికి పొగిడించుకోవడం అతనికి యిష్టం లేదు.

“యిప్పుడు చెత్త కాంపోజిషన్ చదువుతాను” అని టీచర్ మొదలుపెట్టింది. అప్పుడు నాన్న రెండో సారి రాసింది చదివింది. యిప్పుడు జేవురించుకోవడం నాన్న వంతు అయింది. తన తప్పు కాని దానికి తను తిట్లు తినడం ఆయనకి యిష్టం లేదు. ఆయనకి సిగ్గనిపించింది.

టీచర్ నాన్న కాంపోజిషన్ చదివింది.

“మళ్లీ సారి నువ్వు బాగా రాస్తావు కదూ. వాస్య పాడు చెయ్యడు కదూ. యేం తెలిసిందా?” అందావిడ.

“వూఁ” అని నాన్న మెల్లిగా అన్నాడు.

"యేం వాస్య, తెలిసిందా?" అని టీచర్ అడిగింది.

"వూఁ" అని వాస్య అంతే మెల్లిగా అన్నాడు.

వాళ్లు కందిపోయిన ముఖాలతో పక్క పక్కనే కూర్చున్నారు. పిల్లలెవళ్లకీ విషయం అర్థం కాలేదు. చిన్న నాన్న, వాస్య జరిగిపోయిన దాన్ని గురించి యేమీ మాట్లాడుకోలేదు. కాని అప్పట్నుంచీ చిన్న నాన్న తన లెక్కలు తనే చేసుకునేవాడు. వాస్య నాన్న సాయం లేకుండా తన కాంపోజిషన్లు తనే రాసుకునేవాడు. మొదట్లో నాన్నకి చాలా తప్పులు దొర్లేవి. వాస్య కాంపోజిషన్లు బాగుండేవి కావు. క్రమేణా యిద్దరూ యింప్రూవ్ అయేరు. సొంతంగా చెయ్యకపోతే యెప్పటికీ నేర్చుకోలేమని గుర్తించేరు. కాని యిద్దరూ చాలా యేళ్లు వొకే బెంచీమీద కూర్చునే చదువుకున్నారు.

# నాన్న మయకోవ్‌స్కీతో మాట్లాడ్డం



నాన్న చిన్నప్పుడు ఆయన మయకోవ్‌స్కీతో మాట్లాడేడు. లేకపోతే మయకోవ్‌స్కీ నాన్నతో మాట్లాడేడు.

అది చిత్రంగా జరిగింది.

నాన్న ''గని పనివాడు'' అన్న పద్యం రాసి టీచర్‌కి చూపించేడు.

''మన బళ్లో యెవళ్లూ కవిత్వం రాసేవాళ్లు లేరు. యీ పద్యాన్ని స్కూలు పేపర్లో వేద్దాం.

బాగుంది రాయడం. కాని అప్పుడే పూష్కిన్ అయిపోయేవనుకోకు'' అని ఆమె నాన్న పద్యం చదివి అంది.

తను పూష్కిన్ అయిపోయినట్టు అనుకోనని నాన్న మాట యిచ్చేడు.

నాన్న పద్యం స్కూలు పేపర్లో పడింది. అందరూ పిల్లలూ చదివేరు. కవిత్వం రాసే కుర్రాడొకడు మూడవ తరగతిలో వున్నాడని పిల్లలందరికీ తెలిసింది. టీచర్లు బాగుందన్నారు. పిల్లలు యేడిపించారు. ''యిడిగోరా కపి!'' కాని వాళ్లు అలా యెందుకు అంటున్నదీ చిన్న నాన్నకి తెలీదు. పెద్ద ఆడపిల్లలు నాన్నని తమ ఆల్బమ్‌లలో యేమన్నా రాయమన్నారు.

''నువ్వు ప్రతి సారీ మన ప్రతికకి రాస్తూ వుండు, లేకపోతే బాధ పడతావు'' అని స్కూల్ పత్రిక ఎడిటర్ నాన్నతో అని పిడికిలి బిగించేడు.

అలాంటి ఎడిటర్ కవుల కలల పంట అని నాన్న పెద్దయాక గుర్తించేడు. కాని అప్పట్లో వూరికే భయ పడిపోయేడు. ఎడిటర్ యేడవ తరగతి చదువుకునే పెద్ద పిల్లాడు. యెవళ్లేనా భయ పడేటంత పెద్ద పిడికిలి వుంది. దాంతో స్కూలు పత్రిక ప్రతి సంచికలోనూ నాన్న పద్యం వొకటి వుండేది. ఒకో అప్పుడు రెండేసి వుండేవి.

నాన్న రాయని విషయం అంటూ వుండేది కాదు. వసంత రుతువు గురించి, శీతకట్టు గురించి, ఆకురాలు కాలం గురించి, వేసవి కాలం గురించి రాశేడు. పారిస్ కమ్యూన్‌మీద రాశేడు. రౌడీల గురించి, గ్రంథ చౌర్యం గురించి రాశేడు. ''పుగచోవ్ తిరుగుబాటు'' గురించి కూడా రాశేడు. కెమిస్ట్రీ క్లాసు తప్పించుకున్న ఆరవ తరగతి గురించి అది. టీచర్ పేరు పుగచోవ్. ఆ పేరుమీదనుంచి యీ పద్యం పేరు వచ్చింది. రెండేళ్ల కాలంలో నాన్న బోలెడు రాసేశాడు. కాని అవి బాగో ఓగో నాన్నకి తెలీదు. బళ్లో అందరూ పొగుడుతున్నారు గాని తన కవిత్వం నిజమైన కవిత్వం కాదని ఆయనకి మనసులో అనిపించేది. తను నిజమైన కవిత్వం రాయగలడో లేడో తెలుసుకోవాలని ఆయన యేంతో తపించేవాడు. యెవళ్లు చెప్పగలరు తనకి యీ విషయం గురించి? నిజంగా కవులైన వాళ్లు చెప్పగలరు. అతి గొప్ప కవి, ప్రఖ్యాత కవి, ఒక్క ముక్కలో అనుకోవాలంటే మయకోవ్‌స్కీ.

నాన్న తను రాసిన వాటిల్లో భేషుగ్గా వుండే వాటిని యేం మయకోవ్‌స్కీకి చూపించాలని అనుకున్నాడు. కాని నాన్న చాలా చిన్న పిల్లవాడవడంతో మయకోవ్‌స్కీ దగ్గరికి వెళ్లడానికి భయ పడ్డాడు. అంచేత ఆయనతో ఫోన్‌లో మాట్లాడాలనుకున్నాడు. డైరెక్టరీ వెతికి మయకోవ్‌స్కీ టెలెఫోన్ నంబర్ పట్టుకున్నాడు. చాలా రోజులు సాయంత్రం పూట యింట్లో యెవళ్లూలేని సమయం చూసి నాన్న తన పద్యాలు ముందు వేసుకు కూర్చుని, ధైర్యం తెచ్చుకుని రిసీవర్ యెత్తి ఆపరేటర్‌కి నంబరు చెప్పేవాడు.... ఠక్‌మని పెట్టేసేవాడు. మయకోవ్‌స్కీతో మాట్లాడ్డం అంటే ఆయనకి భయంగా వుండేది.

అలా వో వారం జరిగింది. నాన్నకి సిగ్గనిపించింది.

ఆఖరికి వో ఆదివారం నాడు సాయంత్రం మామ్మా, తాతా యింట్లో లేని టైమ్ చూసి నాన్న మయకోవ్‌స్కీకి ఫోన్ చేశాడు. ఉద్రేకంతో వొణికి పోతూ నాన్న రిసీవరు పట్టుకున్నాడు. యీ సారి రిసీవర్‌ని కింద పెట్టెయ్యలేదు. గంభీరంగా, ఘనంగా కంచు కంఠం మోగుతూ వినిపించింది. నాన్న జీవితంలో యెన్నడూ ఆ కంఠాన్ని మర్చిపోలేదు. ఆ వేళ ఆ కంఠం చాలా కోప ఘూర్ణితంగా వుంది.

''యెవరు మాట్లాడుతూ వుంట?'' అని కటువుగా అడిగిందా కంఠం.

నాన్న గుండె జారిపోయింది. ఆయనకి మాట పెగల్లేదు. ''యేవరది? తమాషా అనుకున్నారా? యెవడో వెధవ రోజూ ఫోన్ చేస్తాడు వొక్క మాటా చెప్పడు. వూ, యేదో చెప్పు, పాట పాడు బుజ్జీ'' అని ఆ కంఠం గర్జించింది.

నాన్నకి వొణుకూ, దడానూ. ఒక్క ముక్క అనలేకపోయేడు. తను క్షమాపణ చెప్పే క్షణం దాటిపోయింది, హలో అని యేదో చెప్పే వ్యవధి మించిపోయింది. యిప్పుడు బిగిసి గడ్డకట్టిపోయి వినడమే తను చెయ్యగలిగినదంతా. ఆయన అంతే చేశాడు.

''మంచిది! వూరికే వుండు చూపిస్తా, తడాఖా మళ్లీ ఫోన్ చేస్తే'' మయకోవ్‌స్కీ ధనామని రిసీవరు పెట్టేశాడు.

చిన్న నాన్న మళ్లీ ఆయనకి ఫోన్ చెయలేదు.

మళ్లీ మయకోవ్‌స్కీని చూళ్లేదు, ఆయన గొంతుక వినలేదు. యీ విషయం గురించి యెవళ్లకీ యెన్నడూ చెప్పలేదు. చాలా కాలం యీ సంభాషణ విషయం తెలిసిన వాళ్లు నాన్న మయకోవ్‌స్కీలు మాత్రమే. యిప్పుడు నాన్న ఒక్కడే దీని విషయం తెలిసిన వాడు. కాని దీన్ని ఆయన యెన్నడూ మర్చిపోలేదు. యిప్పుడు దీని విషయం మీకూ తెలుసు.

# నాన్న బడి వార్షికోత్సవంలో కవిత్వం చదవడం



నాన్న చిన్నప్పుడు పక్క స్కూలు వాళ్లు నాన్న స్కూలు వాళ్లని యేదో వార్షికోత్సవానికి పిలిచారు. అంతకు ముందు నాన్న స్కూలు వాళ్లు పిలిచిన దానికి బదులు యిది. నాన్న బళ్లో ఆ పిల్లలు ప్రదర్శన యిచ్చేరు. పాటలు పాడేరు, నాట్యం చేశేరు, పద్యాలు చదివేరు. వ్యాయామ ప్రదర్శన యిచ్చేరు. పూష్కిన్ రాసిన "బొరీస్ గొదునోవ్" నుంచి వో రంగాన్ని ప్రదర్శించేరు కూడా. గ్రిగొరీ పాత్ర వేసిన కుర్రాడు కిటికీలోనుంచి దూకాల్సి వచ్చినప్పుడు కిటికీ చట్రానికి

తగులుకు పోయి మొత్తం సెట్ అంతట్నీ కూల గొట్టేశాడనుకోండి. అది వేరే సంగతి. అలాంటిది యెవళ్లకేనా జరగవచ్చు కదా. మొత్తంమీద వాళ్ల ప్రదర్శన బాగానే వుంది. యిప్పుడు నాన్న వాళ్ల బడి పిల్లల్లు ఆ బళ్లో దర్శన యివ్వాలి. ఆ పిల్లలు అబ్బా అని ఆశ్చర్య పోయేటటు చెయ్యాలని నాన్న బడి పిల్లలు అనుకున్నారు. కాని అలా చెయ్యడం యెలా? ఆ విషయం గురించి చర్చించుకున్నారు.

"మనం పాటలు పాడగలం, కాని వాళ్లూ పాడగలరు. మనం నాట్యం చెయ్యగలం, అది వాళ్లూ చెయ్యగలరు. మనకంటే బాగా చెయ్యగలరు. మన వ్యాయామ ప్రదర్శనలూ వాళ్లవీ యించుమించు వొక్కలాగే వుంటాయి. మన పిరమిడ్ కూలి పోతుందనుకోండి, అయితేనేం, వాళ్ల సెట్ మొత్తం కూలి పోయిందాయిరి. మనం కవిత్వం చదవగలం, కాని వాళ్లూ చదవ గలరు. వాళ్ల చెయ్యలేనిది మనం యేం చెయ్యగలమబ్బా?"

ప్రతి వాళ్లూ గట్టిగా ఆలోచించేరు.

"అవునర్రోయ్! మనకి మీష వున్నాడుగా" అని యెవరో ఆఖరికి అన్నారు.

ప్రతి వాళ్లూ ఫక్కున నవ్వేరు.

"అతను మొరుగుతాడు."

"కోడి కూత కూస్తాడు."

"పిల్లిలా మ్యావ్, మ్యావ్ అంటాడు."

"చేతులమీద అనుకుని నడవగలడు."

"అబ్బబ్బ! అందరూ అలా వొక్క సారే అరవకండి" అంది టీచర్. గోల పద్దు మణిగాక మీష అన్నాడు:

"అయితే యేమిటట? యెవళ్లేనా అలా చెయ్యగలరు. నాకు గనక కవిత్వం చేతనైతేనా దివ్యంగా వుండును మరి."

అతను నాన్నకేసి చూశేడు.

అందరూ నాన్నకేసి చూశేరు.

"నిజముస్మా! మనకి కవి వున్నాడుగా" అంది టీచరు.

"వాళ్లకి కవి లేదు" అని పిల్లలు అరిచేరు.

తనెప్పుడూ స్టేజిమీదకి యెక్కలేదనీ, పైగా పరాయి బళ్లో మరీనసీ, తన కవిత్వం చదవడం మాట సరేననీ నాన్న అన్నాడు.

కాని అప్పటికే యెవళ్ల మట్టుకు వాళ్ల అరుస్తూ కేకలు వేసేస్తున్నారు.

"దాన్ని గురించి పట్టించుకో అక్కర్లేదులే" అంటున్నారు.

"ఫరవాలేదులే" అంటున్నారు.

"అంతా బాగా వుంటుంది. కాని నువ్వు పూష్కిన్‌వి కావు అనే విషయం మర్చిపోకు" అంది టీచరు.

ఆ ముక్క ముందో సారి చెప్పింది, నాన్న దీన్ని యెప్పుడూ మర్చిపోలేదు.

ఆఖరికి ముసళ్ల పండగ రోజు రానే వచ్చింది. నాన్న వేణికి పోతూ వ్యాయామ క్రీడాకారులతో, డాన్సర్లతో, పాటగాళ్లతో కలిసి పరాయి బడికి బయల్దేరేడు. కొత్త స్టేజీ సైడ్ కర్టెన్ల దగ్గర నుంచున్నాడు. కొత్త ఆడిటోరియంకేసి చూస్తూ వున్నాడు. కొత్త ఆడిటోరియం పరాయి మగపిల్లలతో, ఆడపిల్లలతో పిటపిట లాడిపోతోంది. ముందు వరసలో కొత్త హెడ్మాస్టరు, కొత్త టీచర్లు కూర్చున్నారు. అందరూ స్టేజీకేసి చూస్తూ, వింతగా నవ్వుతున్నారు. మీరీ పాటికి గమనించే వుంటారు ఆడిటోరియంలో మామూలు అబ్బాయిలూ, అమ్మాయిలూనే కూర్చున్న వాళ్లు, టీచర్లు మామూలు వాళ్లే, వాళ్లు స్టేజీకేసి చూస్తూ నాన్న బళ్లో పిల్లలు చేసినట్టే చేస్తున్నారు. కాని నాన్నకి స్టేజి ఫియర్‌తో అంతా కొత్తగా, వింతగా కనిపించేయి.

మీష నాన్న చెవిలో గొణిగేడు:

"యేమీ లేదీ బళ్లో. మామూలు వాళ్లే, ఫర్లేదు" అని.

అయినా లాభం లేకపోయింది.

ఆడపిల్లలు నాన్నకి స్వీట్లు యిచ్చేరు.

అయినా లాభం లేకపోయింది.

"ఛీ! ఛీ! యేమిటిది! నీకు పద్యాలు కంఠతా వచ్చు కదా?" అంది టీచరు.

"వూఁ" అన్నాడు నాన్న, పెదాలు వణికి పోతున్నాయి.

ఆఖరికి ఆ క్షణం రానే వచ్చింది.

"యిప్పుడు మా స్కూలు కవి సొంతంగా రాసిన పద్యాలు వింటారు" అని అనౌన్సర్ కంఠం వినిపించింది.

అందరూ చప్పట్లు కొట్టేరు. మీష నాన్నని తోశేడు. నాన్న యీడ్చుకుంటూ తడబడుతూ స్టేజీమీదకి వెళ్లేడు. ఆయనకి చచ్చేటంత భయంగా వుంది. అంత భయం యెప్పుడూ యెరగడు. ఆడిటోరియం తిరిగిపోతోంది. నాన్న గొంతుక పొడారి పోతోంది. చెవుల్లో హోరు. ఆ హోరు నురగని దంచినట్టుగా వుంది.

జనంలో వున్న వాళ్ల మొహాలు వొక్కటీ నాన్నకి కనిపించడం లేదు. పులుముకు పోయిన రంగుల సుళ్లు గిర్రున తిరుగుతూ వున్నట్టు కనిపించేయి. చప్పట్లు కొట్టడం దృశ్యం అది. తర్వాత నిశ్శబ్దం. ప్రతివాళ్లూ నాన్న కవిత్వం కోసం చూస్తూ వున్నారు. కాని నాన్న అక్కడ నుంచున్నాడంతే.

తర్వాత మీష చెప్పేడు నాన్న అక్కడ యెలా కనిపించిందీనీ. నాన్న మొహం నెత్తురు చుక్క లేకుండా పాలిపోయిందట. తర్వాత నీల వర్ణంగా అయిందట. అప్పుడు ఆకుపచ్చగా అయి, యెర్రటి చుక్కలు మొహం అంతా కమ్మినట్టు అయిందట.

"అబ్బ! మీరు అసలు చూసి వుండాల్సింది. బాణసంచా పేలినట్టు వున్నాడు. ఆ బళ్లో యెవళ్లూ అలా చెయ్యలేరు పందెం" అని మీష అన్నాడు.

అప్పుడు ప్రేక్షకుల్లో యెవళ్లో నవ్వేరు.

ఆఖరికి నాన్న తమ బడిని కీర్తిస్తూ రాసిన పద్యం చదవడం మొదలుపెట్టేడు. మొదట అంతా శ్రద్ధగా విన్నారు, మకుటం దగ్గరికి వచ్చేటప్పటికి కలకలం అందు కుంది.

అది యిలా వుంది:

రాబిన్ హుడ్ కంటె ధైర్యం వుండీ
అడవులు కొండలు గాలించండీ
కానగ వత్తురు బుద్ధి మంతులు
స్కూలు 23లో చదివే పిల్లలు!

వార్షికోత్సవం జరిగేది 9వ నంబరు బళ్లో, నాన్న చదువుకునే 23వ నంబరు బళ్లో వాళ్ల కంటే బుద్ధిమంతులు లేరంటే వాళ్లు వొప్పుకుంటారా? తమ బడి గౌరవం దెబ్బ తినెయ్యడం లేదూ. దాంతో వాళ్లు కాళ్లతో నేలమీద తన్నడం, అరుపులు అరవడం మొదలుపెట్టేరు. అసలా గొడవంతా యేమిటో అర్థం కానంతగా బెదిరిపోయి వున్నాడు నాన్న. నాన్న చెయ్యి యెత్తి అన్నాడు:

"దయచేసి చదివేటప్పుడు అడ్డం రాకండి. పద్యం పూర్తిచేశాక మీ యిష్టం వొచ్చినంత అల్లరి చేసుకోండి."

మళ్లీ సద్దు మణిగింది. అలా అనడం తన ముప్పుకి వచ్చిందని నాన్న గమనించలేదు. 9వ నంబరు బడి పిల్లలు చాలా తెలివైన వాళ్లు. నాన్న పద్య పఠనం హుషారైన ఆటలా సాగింది. నాన్న వో పద్యం చదవడం, అంతా సద్దు మణిగి వుండడం. కాని మకుటం దగ్గరికి వచ్చేటప్పటికి గోలగోల అయిపోవడం. పిల్లలు అల్లరి కూతలు, యీలలు, కాళ్లు నేలమీద తన్నడాలు నానా రభసా చేసేవాళ్లు. అప్పుడు గోల సద్దు మణిగేది. నాన్న తడబడుతూ తర్వాతి పద్యం చదివేవాడు. గోల మళ్లీ మొదలయేది. నాన్న ఆ ఖండికలో చాలా పద్యాలు రాశేడు. చివరికంటా చదువుతూనే వున్నాడు. మొత్తంమీద పూర్తిచేసేటప్పటికి ప్రతి వాళ్లకీ నవ్వలేక పొట్టలు చెక్కలై పోతున్నాయి. ప్రేక్షకులేమిటి, సైడ్ కర్టెన్ల దగ్గర వున్న వాళ్లేమిటి, ఆ పరాయి పిల్లలేమిటి తన బడి పిల్లలేమిటి అందరూ వొకటే నవ్వు. మీష టీచర్ దగ్గర నేలమీద దొర్లేస్తున్నాడు. టీచరూ నవ్వుతూ వుంది. నాన్న ఆ అవమానాన్ని యెన్నటికీ మర్చిపోలేకపోయేడు. చాలా యేళ్లు గడిచేయి,

నాన్న పెద్దవాడేయేడు. యివాళ్టికి కూడా యెవరో తెలియని నడి వయస్కుడు హఠాత్తుగా నాన్న దగ్గరికి వచ్చి ''రాబిన్ హుడ్ కంటె ధైర్యం వుండీ'' అని చదివి మ్యాప్‌మని అరుస్తూ పారిపోతాడు. ఆ నడి వయస్కుడు చిన్న పిల్లాడిగా వున్నప్పుడు 9వ నంబరు బడికి వెళ్లేవాడని నాన్నకి తెలుసు. నాన్న పద్యం అతనికి యింకా గుర్తు వుంది. తను పూష్కిన్ కాదు అన్న విషయం నాన్నా యెన్నడూ మర్చిపోలేదు.

# నాన్న పింగ్‌పాంగ్ ఆడడం



నాన్న చిన్నప్పుడు వో కొత్త ఆటని కనిపెట్టారు. దాని పేరు పింగ్‌పాంగ్. యివాళ అయితే బోలెడు మంది పిల్లలకి పింగ్‌పాంగ్ అంటే యిష్టం. కాని అప్పట్లో ప్రతి బళ్ళోనూ, ప్రతి క్లాసులోనూ ప్రతి పెరట్లోనూ పింగ్‌పాంగ్ ఆడేవాళ్లు, బల్లలమీద, బెంచీలమీద, పెద్ద పియానోలమీద, నేలమీద యెక్కడ పడితే అక్కడ ఆడేవారు. తెల్లవారిం దగ్గర్నుంచి చీకటి పడేదాకా ఆడుతూనే వుండేవారు. కొంతమంది రాత్రిళ్లు కూడా ఆడేవాళ్లు. అసలు పింగ్‌పాంగ్ తప్ప

వేరే యేమన్నా వుందా అన్నట్టు కొంతమంది కనిపించేవాళ్లు. నాన్న బడిలో పింగ్‌పాంగ్ పోటీలు జరిగేవి. వో తరగతి వాళ్లు మరో తరగతితో ఆడేవాళ్లు, అప్పుడు ఆ నెగ్గిన వాళ్ల మధ్య పోటీలు జరిగి ఛాంపియన్ వచ్చేవాడు. అప్పుడు యీ బడి ఛాంపియన్లు పేటలో ఆడి పేటకి ఛాంపియన్ యెవరో తేల్చేవాళ్లు. తర్వాత నగరంలో పోటీలు జరిగేవి. మాస్కో, లెనిన్‌గ్రాడ్ నగరాలు పోటీ ఆట ఆడేవి.

చిన్న నాన్నకి యిదంతా చాలా ఆశ్చర్య కారకంగా వుంది. చిన్న చిన్న తెడ్డు ముక్కలతో తెల్లని చిన్న బంతిని కిందికీ మీదకీ యెగరేసి కొట్టడంలో అంత ఘనకార్యం యేమిటో ఆయనకి అర్థం అయేది కాదు.

"అవి తెడ్లు కావు, రాకెట్లు" అనే వాళ్లు పిల్లలు.

"అయితే యేమిటని? నాకేం అర్థం కాదు."

"ఆడి చూడు."

"యిదేం సరదా!"

"సరదాయే."

"వుహుఁ, కాదు."

"ప్రయత్నించు."

"వుహుఁ అక్కర్లేదు."

యిలా చాలా సార్లు జరిగేది. ఆఖరికి వో శుభముహూర్తాన నాన్న కూడా పింగ్‌పాంగ్ రాకెట్ సంపాదించి పింగ్‌పాంగ్ టేబిల్ దగ్గర చేరాడు.

అంతటితో సరి, శ్రీమద్రమార్వణ గోవిందోహరి!

ఓ శుభముహూర్తాన అన్నాను కదా. కాని నాన్న తల్లితండ్రులు తమ జీవితాల్లో అది పరమ చెడ్డ రోజు అంటారు. నాన్నకి పింగ్‌పాంగ్ అంటే మోజు పుట్టబట్టి మొదట్లో నాన్న రాకెట్‌తో బంతిని కొట్టలేకపోయేడు. తర్వాత అలా కొట్టడం నేర్చుకున్నాడు. కాని అది బల్ల మీద గెంతేది కాదు. బంతిని కొట్టడం, అది బల్లమీద గెంతడం సాధించేక నాన్నకీ ఆట అంటే సరదా పుట్టింది. బంతిని రకరకాలుగా కొట్టవచ్చని నాన్న కనిపెట్టేడు. దాన్ని కొయ్యవచ్చు, గిర్రున తిరిగేట్టు కొట్టవచ్చు. అలా కొట్టినప్పుడు బంతి వో మూలకి యెగిరిపోయేది. మంచి ఆటగాడు అవతలి వాడి వేపు బాగా చిక్కు కలిగించేటట్టుగా బంతిని కొట్టగలడు. పింగ్‌పాంగ్ భలే ఆట అని నాన్న యిప్పటికీ అనుకుంటాడు. కాని అప్పట్లో పింగ్‌పాంగ్ మాత్రమే ప్రపంచం

మొత్తంమీద యేకైక ఆసక్తికరమైన ఆట అని నాన్న అనుకునేవాడు. చదువు పోయింది, హోమ్‌వర్క్‌కి యెగనామం అయింది. ఆయన బడికి వెళ్లడం యెందుకూ అంటే యీ ఆట ఆడుకోవడానికి. బాగా, యింకా బాగా ఆడుతూ వుండేవాడు. కాని ఆయన మార్కులు, పాడుగా, యింకా పాడుగా దిగజారేవి.

టీచర్ నాన్నని పక్కకి తీసుకు వెళ్లి చాలా సార్లు మాట్లాడింది. బాబూ దేనికైనా వో హద్దూ పద్దూ వుంటుందని చెప్పింది. "అతి సర్వత్ర వర్జయేత్" అని కూడా చెప్పింది.

నాన్న వాదించలేదు. ఆయినా యిందులో వాదనకేం వుంది? తన జీవితానికి సంబంధించి నంత వరకూ పింగ్‌పాంగ్ వొకటే ధ్యేయం అనీ, మిగిలిన వన్నీ ఉత్తుత్తివి అనీ యెలా చెప్పగలడు. నాన్న అంత బాగా యెవళ్లూ ఆడేవాళ్లు కాదు. ఆయన అందర్నీ చిత్తు చేసేసేవాడు. బడిలో మూడవ అతిపెద్ద ఆటగాణ్ణి నాన్న ఓడించిన రోజున టీచర్ అంది:

"మీ అమ్మతో నాన్నతో మాట్లాడాలి. యిలా అయితే లాభం లేదు."

ఆవిడ మామ్మకీ తాతకీ ఉత్తరం రాసింది. అది వాళ్లకి అసలు అందనే లేదు. నాన్నే దాన్ని యింటి దగ్గర లెటర్ బాక్స్‌లోనుంచి లాగేసి చదివేసి చింపి పారేశాడు. చిన్న చిన్న ముక్కలు ముక్కలుగా చింపేశాడు.

అప్పుడు టీచర్ యింకో ఉత్తరం రాసింది. ముందటి దానికంటే అధ్వాన్నంగా వుందది. అంచేత నాన్న దాన్ని యింకా యింకా చిన్న చిన్న ముక్కలు చేసేశాడు.

దాన్ని గురించి చెప్పాలంటే సిగ్గుగా వుంది కాని జరిగింది అదీ.

తాతా, మామ్మా బడికి తనని కలుసుకోవడానికి రాకపోవడం టీచర్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఆమె మూడో ఉత్తరం రాద్దాం అనుకుంటూ వుండగా నాన్న స్కూల్ ఛాంపియన్‌ని వోడించేశాడు. యిక బళ్లో తను సాధించాల్సింది యేదీ లేదని ఆయన తేల్చేసుకున్నాడు. దాంతో మొత్తానికి బడికి వెళ్లడమే మానుకున్నాడు. పొద్దున్నే బళ్లోకి వెళ్లడానికి బయల్దేరేవాడు. సంచీలో నోట్సు పుస్తకాలు గాని, పాఠం పుస్తకాలు గాని వుండేవి కాదు. వాటి బదులు రెండు పింగ్‌పాంగ్ రాకెట్లు, వొక నెట్, మూడు బంతులు వుండేవి. మధ్యాహ్నం భోజనానికి బదులుగా వో రొట్టె ముక్క. రోజంతా పింగ్‌పాంగ్ ఆడుతూనే వుండేవాడు. యిప్పుడు నాన్నకి బోలెడు మంది స్నేహితులు పోగయేరు. అందరూ పింగ్‌పాంగ్ పిచ్చి బాగా ముదిరిన వాళ్లే. ఆయనకి మాస్కో ఛాంపియన్లందరూ తెలుసు. ప్రఖ్యాత ఫాల్కోవిచ్ సోదరులు నాన్నని తమ సమస్థాయి వాడుగా పలకరించేవాళ్లు. నాన్న అప్పుడు జూనియర్ టీమ్ మెంబరు. కాని ఆయన అప్పటికి

అసలైన ఆట పోగొట్టుకున్నాడు. ఆయన... కాని ఆ వేళని టీచరు తను రాసిన ఉత్తరాలకి జవాబు రాలేదేం చెప్మా అని నాన్న యింటికి వెళ్లింది. నాన్న యింటి దగ్గర లేదు. తాతా, మామ్మా వున్నారు. తమ పిల్లాడు బడి యెగ్గొట్టేసి తెల్లబంతిని మోదుకుంటూ కాలక్షేపం చేసేస్తున్నాడని విని వాళ్లు కొయ్యబారిపోయేరు. నాన్నకి మతిపోయి వుంటుందని అనుకున్నారు. తాము యెన్నడన్నా పింగ్‌పాంగ్ ఆడేరా పెట్టేరా! రాకెట్లనీ, బంతుల్నీ దాచేసి నాన్నని డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్లేరు. మామూలు అల్లాటప్పా డాక్టరు దగ్గరికి కాదు, తన యావజ్జీవితం పిచ్చి వాళ్లని నయం చెయ్యడంలో గడిపిన ప్రొఫెసరు దగ్గరికి. ఆయనా యెన్నడూ పింగ్‌పాంగ్ ఆడిన వాడు కాదు. యీ ఆట కోసం నాన్న బడి మానెయ్యడం యేమిటో ఆయనకీ అంతు బట్టలేదు. కాని ప్రొఫెసరు తనని అలాంటి ప్రశ్నలు యెందుకు అడుగుతున్నాడో నాన్నకీ అంతుబట్టలేదు. ప్రొఫెసరు అడిగిన ప్రశ్నలు యివి:

"బళ్లో పిల్లలు నిన్ను కొడతారా?"

"బాగా నిద్రపడుతుందా?"

"పొద్దుటి పూట తల నొప్పి వస్తుందా?"

"సాయంత్రం పూట తల నొప్పి వస్తుందా?"

"చీకటి అంటే భయంగా వుంటుందా?"

"నీకెప్పుడేనా ఫిట్లు వచ్చేయా?"

"నీకెప్పుడేనా స్పృహ తప్పిందా?"

నాన్న యీ అడిగిన వాటన్నిటికీ లేదు అని జవాబు చెప్పేడు.

ప్రొఫెసరు యింకా అడిగేడు.

"నీకు మీ బడి అంటే యిష్టమేనా?"

"మీ టీచర్ అంటే యిష్టమేనా?"

"బళ్లో నీకు స్నేహితులు వున్నారా?"

"అబ్బాయిలా?"

"అమ్మాయిలా?"

నాన్న యీ అడిగిన వాటన్నిటికీ "వూఁ" అనే జవాబు చెప్పేడు.

"అందరికంటే యెక్కువ యిష్టపడే అమ్మాయి యెవళ్లన్నా వున్నారా?" అని ప్రొఫెసరు అడిగేడు. నాన్నకి చిరాకెత్తింది.

''యేమిటీ ప్రశ్నలన్నీ డాక్టరుగారూ? నేను బడి ఎగ్గొట్టేను, పింగ్‌పాంగ్ ఆట ఆడుకోవడానికి. యిక మీరడిగే వాటికి దేనితోనూ సంబంధం లేదు'' అన్నాడు.

''వూఁ. అయితే యిప్పుడు యేం చేద్దామనుకుంటున్నావు?'' అని ప్రొఫెసరు అడిగేడు.

''పింగ్‌పాంగ్ ఆడుకోవడం'' అని నాన్న వొక్క క్షణం కూడా తడబడకుండా చెప్పేడు.

''దీని పర్యవసానం యేమిటో తెలుసా? దాన్ని గురించి యెప్పుడన్నా అనుకున్నావా?''

''ఆఁ. మా టీమ్ మాస్కో టీముని వోడిస్తుంది'' అన్నాడు నాన్న.

''నేను సీరియస్‌గా అడుగుతున్నాను'' అని ప్రొఫెసరు గంయ్‌మన్నాడు.

''నేనూ సీరియస్‌గానే చెపుతున్నా'' అన్నాడు నాన్న.

యిక చేసేదేమీ లేనట్టు ప్రొఫెసరు భుజాలు యెగరేసి వో గ్లాసులోకి యేవో కొన్ని చుక్కలు పోసి ''వూఁ, తాగు'' అన్నాడు.

''నేను తాగను, నాకు జబ్బు యేం లేదు'' అన్నాడు నాన్న.

''కాని నాకు జబ్బుగా వుంది'' అంటూ ప్రొఫెసరు తను తాగేశాడు. తర్వాత నాన్నతో మెల్లిగా అన్నాడు:

''మీ అమ్మనీ నాన్ననీ వొప్పిస్తాను యీ యేటికి పింగ్‌పాంగ్ ఆడుకోనిమ్మని. మరి వానా కాలంలో బడికి వెడతానని నాకు మాట యిస్తావా?''

''ఆఁ'' అన్నాడు నాన్న.

అప్పుడు ప్రొఫెసరు తాతనీ, మామ్మనీ పిలిపించేడు.

''కుర్రాడు నిక్షేపరాయుడల్లా వున్నాడు. ఆడుకోనివ్వండి. యీ టెర్మ్‌లో చాలా భాగం అయిపోనే అయిపోయింది'' అని చెప్పేడు. అని మరింత మందు తీసుకున్నాడు. నాన్నని తాతా, మామ్మా యింటికి తీసికెళ్లేరు.

నాన్న టీము టోర్నమెంట్‌లో నెగ్గలేదు. కాని ద్వితీయ స్థానం వచ్చింది. ఆ సంవత్సరం నష్టం కాలేదనే నాన్న యిప్పటికీ అంటాడు. పింగ్‌పాంగ్ వొకటే ప్రపంచంలో అతిముఖ్యమైంది కాదని నాన్న గుర్తించేడు. బడి పోతోందే అని కూడా గమనించేడు. వానాకాలం వచ్చేక సంతోషంగా బళ్లోకి వెళ్లేడు. తర్వాత చదువు పూర్తిచేశేడు. చాలా యేళ్లు గడిచేయి. ఆయన పాత పింగ్‌పాంగ్ రాకెట్ యింకా అల్మారా పైన వుంది. దాన్ని చూస్తేనే తాతకీ, మామ్మకీ వణుకు వస్తుంది. కాని నాన్న దానికేసి ఆప్యాయంగా చూస్తాడు. పింగ్‌పాంగ్ కోసం బడి మానెయ్యడం తెలివితక్కువతనమే కదా. యీ ముక్క విన్న ప్రతివాళ్లూ నవ్వుతారు. నాన్న కూడా నవ్వుతాడు.

అయితేనేం పింగ్‌పాంగ్ మంచి ఆట. దీన్ని గురించి యేదో వొక రోజున రాస్తాను.

తన కూతురు పింగ్‌పాంగ్ ఆడుతోందని తెలిసి నాన్న భయపడిపోయేడు. కాని ఆమె బళ్లో పింగ్‌పాంగ్ ఛాంపియన్ అయినా బడి మానడం లేదని తెలిసి హమ్మయ్య అనుకున్నాడు.

అప్పుడు ఆయనకి అర్థం అయింది తాతా, మామ్మా యెలా బాధపడిందీవీ. ఆయన తన పాత రాకెట్‌ని అల్మారా మూల దాచేశాడు.

కాని అడపాదడపా దాన్ని యివతలకి తీసి తన చిన్నప్పటి పింగ్‌పాంగ్ రోజుల్ని గుర్తుచేసు కుంటూ వుంటాడు.

# నాన్న స్టూలు తయారు చెయ్యడం



నాన్న చిన్నప్పుడు ఆయన సొంతంగా వో స్టూల్ తయారు చేశాడు. ఆ స్టూల్ని ఆయన యెన్నడూ మర్చిపోలేదు. లోకం మొత్తంమీద అలాంటిది లేదు. నాన్న వండ్రంగం టీచర్ జాకర్ పెత్రోవిచ్ అభిప్రాయం కూడా అంతే.

బళ్లో వాళ్లకి వర్క్ షాపు వుండేది. రంపంతో కొయ్యడం, సుత్తి పుచ్చుకు కొట్టడం,

చిత్రిక బట్టడం, చెక్కలు అతకడంలాంటి వన్నీ ఆ టీచర్ నేర్పేవాడు. బాగా చెయ్యలేకపోతే దాన్ని వూడగొట్టి మళ్లీ చెయ్యడం నేర్పేడు.

జాకర్ పెత్రోవిచ్ ముసలాయన. చిన్నగా వుండేవాడు. ఉక్కు ఫ్రేమ్ కళ్లద్దాలు వుండేవి. "చెయ్యి తిరిగిన వాడంటే పనికి భయం" అనేది ఆయన సూక్తి.

"యెడ్డి మనిషికి పని అంటే భయం" అనీ ఆయన అనేవాడు.

ఆయన మొదటి పాఠాన్ని యిలా మొదలుపెట్టేడు:

"యేమిటిది?"

"సుత్తి!" అని ప్రతివాళ్లా చెప్పేవాళ్లు.

"బాగుంది. మరి యిది?"

"మేకు!"

"బాగుంది. యిదో?"

"పలక."

"బాగుంది. యిప్పుడు మేకుని పలకకి కొట్టాలి యీ సుత్తితో ఒక దెబ్బకి. యేం, యెవళ్లు ముందుకు వస్తారు?"

"నేను!"

"నే కొడతా!"

"నేను చేస్తా!"

అలా చాలా మంది ముందుకి వచ్చేవాళ్లు. చాలా బలంగా వుండే పిల్లలు కూడా వొక్క దెబ్బకి మేకు దిగగొట్టలేకపోయేవాళ్లు. అప్పుడు జాకర్ పెత్రోవిచ్ యింకో మేకు తీసుకుని పలకమీద పెట్టి కొట్టేవాడు. గట్టిగానూ కొట్టేవాడు కాదు. అందరూ నోరు వెళ్లబెట్టి చూసేవాళ్లు. వొక్క దెబ్బకి మేకు పలకలోకి దిగేది.

"మీకు గురి సరిగా వుండాలి, చెయ్యి నిలకడగా వుండాలి, యేం తెలిసిందా?" అనేవాడు ఆయన.

"ఆఁ" అని నాన్న అంటూనే బొటన వేలు చితక గొట్టుకున్నాడు.

నాన్నకి తల తిరిగి చుక్కలు కనిపించేయి. పిల్లలందరూ నవ్వేరు.

"నవ్వడం యెందుకు?" అనేవాడు జాకర్ పెత్రోవిచ్. "నేను మొదటి సారే మేకు దిగ గొట్టేనని అనుకుంటున్నారా? అప్పుడప్పుడు నా వేలు చితికేది, అప్పుడు బుర్రమీద వొక్కటి పడేది.

మా గురువుగారు అలా వేస్సేవాడు. తను మేకు దిగగొట్టేనని మేము దిగగొట్టలేదని అలా చెప్పడం అన్న మాట'' అనేవాడు జాకర్ పెత్రోవిచ్.

అందరూ పాపం టీచర్ అని జాలి చూపించేవాళ్ళు. అప్పుడు జాకర్ పెత్రోవిచ్ మళ్ళీ నవ్వి అనేవాడు:

''మరేం భయపడకండి. నేను మిమ్మల్ని కొట్టను. యిక్కడ మీరే యజమానులు. యిక్కడున్నదంతా మీ కోసమే. చిన్న స్టూలు యెలా చెయ్యాలో ముందు నేర్చుకుందాం.''

చిన్న స్టూలు! అంతకంటే సులభమైంది వుంటుందా? కాని వొక్క స్టూలు చేసి చూడండి. అది సరిగ్గా కొలతల మేరకి వుండేట్టు చెయ్యండి. అబ్బో! యెంత రంపపు పని వుంది, చిత్రిక పని వుంది, అతికించే పని వుంది! యెన్ని సార్లు మళ్ళీ మళ్ళీ విప్పి చెయ్యాలీ యేం కథ! యెంత పని, శక్తి, నేర్పు, ఓర్పు కావాలనుకున్నారు!

మొదట స్టూల్ పూర్తిచేసిన వాడు మీష.

''కూర్చోండి'' అని మీష గొప్పగా అన్నాడు.

''ముందర నువ్వు కూర్చుందూ'' అన్నాడు జాకర్ పెత్రోవిచ్.

మీష జాగ్రత్తగా కూర్చుంటూ చాలా ఘనంగా గొప్పగా భావించుకున్నాడు. స్టూలు కిర్రుమంటూ విరిగి చక్కాపోయింది. మీష నేలమీద పడ్డాడు, అందరూ నవ్వేరు.

''నువ్వు గబగబానే చేశావు గాని బాగా చెయ్యలేదు, మళ్ళీ మొదలెట్టు. హడావుడి పడకు. లేకపోతే మళ్ళీ అందరూ నవ్వుతారు'' అన్నాడు జాకర్ పెత్రోవిచ్.

యెవళ్ళూ మొదటి సారే మంచి స్టూలు చెయ్యలేకపోయేరు. ప్రతివాళ్ళూ మళ్ళీ ప్రయత్నించాల్సి వచ్చింది.

''మరేం బెంగపడకండ్రా'' అని జాకర్ పెత్రోవిచ్ వాళ్లని సముదాయించేడు. ''సాధన మున పనులు సమకూరు ధరణిలో. యెవళ్లు పడితే వాళ్ళు సుత్తినీ, రంపాన్నీ వాడెయ్యగలరని మీరు అనుకున్నారు. అది నిజమే గాని మంచి పని చెయ్యడానికి బోలెడు శ్రమ పడాలి'' అన్నాడు.

పిల్లలు తమ శాయ శక్తులా ప్రయత్నించేరు. మామూలు పాఠమే అది. యెవళ్ల మట్టుకి వాళ్ళే మొదటగా పని సాధించాలని ప్రయత్నించేరు. నిజంగా సరదాగా వుందది. పనిని అలానే వుంచెయ్యలేరు కదా. దాన్ని సాధిస్తేనే వుంది అంతా. కాని యిక్కడ మీరు చేసిన స్టూలుమీద మీరే కూర్చోగలరు. పక్క వాళ్లనీ రమ్మని కూర్చోమనగలరు.

వార్య గ్లాజునోవా మొదటగా మంచి స్టూలు చేసింది. ఆమె ఆడపిల్ల అయి వుండి కూడా! వాళ్ల నాన్న వడ్రంగం పని చేస్తాడనుకోండి. ఆయన పరికరాలు యెలా వాడాలో ఆమెకి నేర్పేడు. జాకర్ పెత్రోవిచ్ ఆమెని అదేలోకం పొగిడేడు.

“భేష్! మగపిల్లలు సిగ్గు తెచ్చుకోండ్రా” అన్నాడు.

మగపిల్లలు చెడ్డ బాధపడిపోయేరు. ఆమెని యేడిపించడం మొదలుపెట్టేరు.

కాని ఆమె వుడుక్కోలేదు.

“సరే మీ స్టూల్సు యేవీ?” అని అడిగింది.

మగపిల్లల నోళ్ల మూతలు పడిపోయేయి.

మీష స్టూలు చేసిన రెండోవాడు.

మగపిల్లలు యిబ్బంది పడాల్సింది లేకపోయింది. తర్వాత ప్రతి వాళ్ళూ పని పూర్తి చేసి, అయిందనిపించేరు.

“యేదో మొత్తంమీద స్టూలు ఆకారం తెల్చారు” అన్నాడు జాకర్ పెత్రోవిచ్.

ఆఖరికి నాన్న కూడా స్టూలు పూర్తి చేశాడు. నాన్నకి బరుకులు అయిపోయేయి, దెబ్బలు తగిలిపోయేయి, ముఖానికీ చేతులకీ జిగురు పులుముకు పోయింది. అయినా నాన్న లెక్కచెయ్యలేదు. తను చేసిన మొదటి స్టూలు తన ముందు వుంది! తన మొదటి స్టూలు వచ్చినప్పుడు ఆయనకి కలిగిన సంతోషంలాంటి సంతోషం ఆయన పుట్టిన రోజు నాడు కూడా ఆయనకి కలగలేదు. జాకర్ పెత్రోవిచ్ ఆ విషయం గమనించినట్టే వుంది.

“వూఁ మరి కూర్చో దానిమీద!” అంతే, అవి మంత్రపూరితం అయిన మాటల్లా కనిపించేయి.

నాన్న దానిమీద జాగ్రత్తగా కూర్చున్నాడు. స్టూలు కిర్రుమని కూడా అనలేదు. జాకర్ పెత్రోవిచ్ దానికేసి జాగ్రత్తగా చూశేడు.

“కాళ్ల లెక్కపెట్టు” అన్నాడు మెల్లిగా.

నాన్న ఆశ్చర్యపోయేడు. ఆయన తన కాళ్లకేసి చూసుకున్నాడు. రెండు వున్నాయి, మామూలు గానే. కాని అబ్బాయిలు, అమ్మాయిలు యికిలించడం మొదలుపెట్టేరు. జాకర్ పెత్రోవిచ్ కూడా నవ్వేడు.

తను అయిదు కాళ్ల స్టూల్ని యెలా చేశాడో యివాల్టికీ నాన్నకి అర్థం కాలేదు. కాని

ఆది వుంది. అది మా దగ్గర యింకా వుంది. అయిదు కాళ్లున్నాయి, నాలుగు కాదు. “మూడు కంటే అయిదు కాళ్లు వుండడం మెరుక్కాదు. మళ్లీ చెయ్యి” అని జాకర్ పెత్రోవిచ్ అన్న మాటలు యింకా నాన్న చెవుల్లో వినిపిస్తూనే వున్నాయి. మీరు చేసే పని యేదయినా గానీ మీరు గుర్తుంచుకోవాల్సిన విషయం యిది అని ఆయన అనుకుంటాడు.



## పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించి, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:


Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

అలెక్సాండర్ రాస్కిన్ (1914–1971) – విఖ్యాతుడైన సోవియట్ రచయిత. ముఖ్యంగా హాస్యచతురత తొణికిసలాడే రచనలు చేశాడాయన.

"నాన్నారి చిన్నతనం" అనేది వొక్కటే పిల్లలకోసం ఆయన రాసిన రచన. యిది హాస్య పూరితంగా వుంటుంది. హృదయాన్ని స్పందింప చేస్తుంది. యిది పిల్లలకీ, తల్లితండ్రులకీ కూడా యెంతో నచ్చింది. చాలా యేళ్ళుగా దీన్ని అనేక ప్రపంచ భాషలలో ప్రచురిస్తున్నారు.

...రచయిత కూతురుకి వొకప్పుడు తీవ్రమైన జబ్బుచేసింది. ఆమె బాధ మరపింపచెయ్యడానికి ఆయన తన చిన్నతనం గురించిన కథలు చెప్పాడు. "జబ్బు పడిన కూతురి పట్ల ఆయన జాలి, అనురాగం, ఆమెని కులాసాగా నవ్వేటట్లు వుంచాలన్న ఆతృత యెంతటివంటే ఆయన తనని తను హాస్యం పాలు చేసుకుంటున్నానని కూడా చూడకుండా యీ కథల్ని చెప్పాడు" అని వొక విమర్శకుడు రాశాడు.

గొప్పలు పోతూ, తలబిరుసుగా వుండే పిల్లల్ని తనని కూడా మినహాయించుకోకుండా, అపహాస్యం చేస్తూ, రచయిత తన బుజ్జి పాఠకులకి ఆలోచనా ప్రేరకమైన విషయాన్ని అందిస్తున్నారు: "మొట్టమొదటగా మీరు మంచి మనిషి అవాలి. అదీ పైలట్‌కి గాని, పశువుల కాపరికి గాని, ఐస్ క్రీమ్ అమ్మేవాడికి గాని ముఖ్యం..."



ISBN 5-05-002343-2